

1997 ఫిబ్రవరి ప్రాథమిక పరీక్షలో సర్వప్రథములుగా వచ్చిన
శ్రీ ఎమ్. స్వరూపరాణికి స్వర్ణపతకము బహూకరించుచున్న
దక్షిణ భారత హిందీ ప్రచార సభ అధ్యక్షులు శ్రీ బోయపాటి నాగేశ్వరరావుగారు.

---

## పట్టణ హిందీ ప్రేమీమండలి-గుంటూరు



మండలి అధ్యక్షులు శ్రీ చెక్కా రామకృష్ణారావుగారు సభ కార్యదర్శి శ్రీ ఓ. సురుళిగారిని
శాలువాతో సత్కరించుచున్న సందర్భమున తీసిన ఛాయాచిత్రము.

టెలిగ్రామ్ : హిందీ సంఘ్

ఫోన్ : 3316865

523

# స్రవంతి

సాహిత్య మాసపత్రిక

డిసంబర్ 1997

సంపాదకులు

శ్రీ బోయపాటి నాగేశ్వరరావు

శ్రీ ఈమని దయానంద

శ్రీ ఒ. సురుళి

సహాయకులు

శ్రీ ఎమ్.వి. సుబ్రహ్మణ్యశర్మ

దక్షిణ భారత హిందీ ప్రచార సభ - ఆంధ్ర

ఖైరతాబాదు, హైదరాబాద్ - 500 004.

సంవత్సర చందా
రూ. 60-00

విడి ప్రతి
రూ. 6-00

Recommended for use in all the Public Libraries and School Libraries by the Director of Public Libraries, Andhra State, Madras Vide Proceedings Sl. No. 30/55 dated 6th January 1955.

# ఈ సంచికలో.....

సంపాదకీయం

# జాషువా అవార్డు - ప్రముఖ హిందీ కవి

జాషువా పేరెత్తగానే కావ్యప్రియులు అత్యుత్సాహం, నిండు హృదయంతో ఆయన పద్యాలను ఆలపిస్తారు. ఆయన కవి కోకిల, మధురశ్రీనాథ, కవిదిగ్గజ, నవయుగ కవి చక్రవర్తి, విశ్వకవి సమ్రాట్. 76 సంవత్సరాలు జీవించి 1971లో అస్తమించిన జాషువాకు మరణం లేదు. ప్రజల కొరకు వ్రాసిన ప్రజాకవి ప్రజల మధ్య శాశ్వతంగా వుంటాడు.

జాషువాయే అన్నట్లు

రాజు మరణించె నొకతార రాలిపోయె
కవియు మరణించె నొకతార గగనమెక్కె
రాజు జీవించె రాతి విగ్రహములందు
సుకవి జీవించె ప్రజలనాలుకల యందు

జాషువాది నిండైన విగ్రహం, రాజసం తొణికిసలాడే ముఖ కవళికలు, తెలుగుతనం ఉట్టిపడే మీసాల పొందిక. ఆయన కవిత్వం మృదుమధురం, తెనుగు నుడికారపు సొంపు, సరళ సుందరమైన శైలి. జాషువా కులమతాలు గీచుకున్న గీతలకు గట్టుపడని విశ్వమానవుడు, విశ్వకవి. ఒక సందర్భంలో ఆయన కవిత్వాన్ని తెగమెచ్చుకొని, కులం తెలియగానే ఈసడించినప్పుడు 'బాకున గ్రుమ్మినట్లగును' అని ఎంతో ఆవేదన జెందుతాడు. ఆత్మాభిమానంతో, ధైర్యంగా నిలబడి సంఘాన్ని ఎదురొడ్డిన 'మదమ త్రిప్పని యాంధ్ర పుత్రు'డాయన. చెళ్లపిళ్ల కవీంద్రుడు గండపెండేరం తొడిగి సత్కరించినప్పుడు తన కవిత్వ కళావధూటికి ఇంతకంటె ఇంకేమి కావాలని మురిసిపోయిన ధన్యజీవి జాషువా.

ఆధునిక కాలంలో ఛందోబద్ధ పద్యానికి వన్నెతెచ్చి ఖండకావ్యాన్ని సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దిన ఘనత జాషువాది. స్వప్నకథ, అనాథ, గబ్బిలము, నేతాజీ, బాపూజీ, రాష్ట్రపూజ, ఫిరదౌసి, ముంతాజ్‌మహల్, క్రీస్తుచరిత్ర, నాకథ మొదలగు మూడు పదుల కావ్యాలు రచించారు. కావ్యాలన్నీ రసవాహికలే. ఆధునిక కవులలో ఎక్కువ ప్రజాదరణ పొందిన కవి. ప్రజా నాయకులవలె ఈ ప్రజాకవి విగ్రహాలు కూడ కూడలిలలో వెలుస్తున్నాయి. జాషువా కవి స్మృత్యర్థం జాషువా ఫౌండేషన్ ఏర్పాటు చేయబడి ప్రతి సంవత్సరం లక్షరూపాయల పురస్కారం యివ్వడం ఆయనకు ఘనమైన నివాళి. సుప్రసిద్ధ మహాకవి, జ్ఞానపీఠ అవార్డు గ్రహీత డా॥ సి. నారాయణరెడ్డి,

ఫౌండేషన్‌కు ఛైర్మన్‌గా జాషువా పుత్రికారత్నం శ్రీమతి హేమలతా లవణం మేనేజింగ్ ట్రస్టీగా వుండడం సువర్ణానికి తావి అబ్బినట్లు అవార్డుకు విశేష ప్రతిష్ఠ చేకూరింది.

1997 జాషువా సాహిత్య పురస్కారానికి అవార్డు నిర్ణేతలు ప్రసిద్ధ హిందీ మహాకవి ప్రొఫెసర్ కేదారనాథ్ సింహ్‌ను ఎంపిక చేయడం ముదావహం. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రావతరణ దినోత్సవం నాడు రవీంద్రభారతిలో జరిగిన పురస్కార ప్రదానసభలో భారత రాష్ట్రపతి గౌ॥ కె.ఆర్. నారాయణన్ గారు ముఖ్య అతిథిగా పాల్గొని స్వయంగా కేదారనాథ్ సింహ్‌కు లక్ష రూపాయల బహుమతినిచ్చి, శాలువాతో సన్మానించడం సరస్వతీమ తల్లినే అలంకరించినట్లుగా వుంది.

సన్మాన సభలో జాషువా రచనలను దేశవ్యాప్తంగా ప్రాచుర్యంలోకి తేవడానికి అఖిలభారత స్థాయిలో ఫౌండేషన్‌కు తన పూర్తి సహకారాన్ని అందజేస్తానని రాష్ట్ర ముఖ్యమంత్రి గౌ॥ చంద్రబాబునాయుడు హామీ యివ్వడం మిక్కిలి సంతోషదాయకం. ప్రొఫెసర్ కేదారనాథ్ సింహ్ తనకు జరిగిన సత్కారానికి సమాధానంగా జాషువా రచనలను హిందీలోకి అనువదించి ఆయనను విప్లవ మహాకవిగా హిందీ సాహితీలోకానికి పరిచయం చేస్తానని చెప్పి నిండు కృతజ్ఞత జూపారు.

40 సంవత్సరాల నాటిమాట. హిందీ తెలుగుభాషలలో సమర్థుడైన కవి శ్రీ దుర్గానంద్ జాషువా ఫిరదౌసి కావ్యాన్ని హిందీలోకి అనువదించగా అచ్చు వేయించాము. దాని ఆవిష్కరణ సభ తెనాలి హిందీ ప్రేమీమండలి మహా విద్యాలయంలో ఏర్పాటు జేసి జాషువాగారినే ఆహ్వానించాము. వారు మిక్కిలి సంతోషంతో విచ్చేసి ఆవిష్కరించారు. తన కొన్ని పద్యాలు చదివి వాటి హిందీ అనువాదాన్ని వినిపించుకుని ఆనందించారు. తన రచనల నన్నిటినీ హిందీలోకి అనువదించమని కోరారు. సందర్భవశాత్తు పాఠక లోకానికి యీ విషయాన్ని తెలియజేస్తున్నాము. జాషువా చిరకాల వాంఛ కేదారనాథుడు తీరుస్తారని ఆశిద్దాము.

జాషువా అవార్డు పొందిన ప్రొఫెసర్ కేదారనాథ్ సింహ్ 1934లో ఉత్తర ప్రదేశ్ బలియా జిల్లాలో రైతు కుటుంబమునందు జన్మించారు. కాశీ విశ్వవిద్యాలయం నుండి ఎం.ఎ., పి.హెచ్.డి. పొందారు. చాలా సంవత్సరాలు పలుచోట్ల కళాశాలలో పనిజేసి చివరకు ఢిల్లీలోని జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయంలో హిందీ ప్రొఫెసర్ అయ్యారు. పలు భాషల పండితుడు, మంచి విమర్శకుడు గొప్ప కవి. చాలామంది ప్రపంచ ప్రసిద్ధ కవుల రచనలను హిందీలోనికి అనువదించారు. ఆయన కవిత్వాలు కూడ ఇంగ్లీషులోకి వివిధ భారతీయ భాషలలోకి అనువదింపబడ్డాయి. గ్రామీణ వాతావరణం, సమకాలీన సంఘ జీవితం ఆయన కవితలలో ప్రతిబింబిస్తుంది. వారివి అనేక కవితా సంపుటులు వెలువడ్డాయి, బహుమతులు పొందాయి. సుప్రసిద్ధుడైన హిందీ మహాకవి, బహుగ్రంథకర్త ప్రొఫెసర్ కేదారనాథ్ సింహ్‌ను దక్షిణ భారత హిందీ ప్రచారసభ, స్రవంతి తరపున నిండు మనస్సుతో అభినందిస్తూ వారికి శుభాకాంక్షలు తెలియజేస్తున్నాము.



# కృష్ణశాస్త్రి

- పరిపూర్ణాచారి బొల్లోజు
యంఏ(తెలుగు)కె.యు.సి

సౌరభము లేల చిమ్ము పుష్పవ్రజంబు?
చంద్రికల నేల వెదజల్లు చందమామ?
ఏల సలిలంబు పారు? గాడ్పేల విసరు?
ఏల నా హృదయంబు ప్రేమించు నిన్ను?

అని ప్రేమించడం తన నైజగుణం అని అన్నారు కృష్ణశాస్త్రి. భావ కవితా చక్రవర్తి అయిన కృష్ణశాస్త్రిగారు క్రీ.శ. 1897 నవంబరు మాసంలో తూర్పు గోదావరి జిల్లాలోని పిఠాపురం సమీపంలో ఉన్న చంద్రపాలెం గ్రామంలో, విద్వత్కవి అయిన వేంకటశాస్త్రి గారికి జన్మించారు. కృష్ణశాస్త్రిగారు పిఠాపురం, కాకినాడలలో విద్యాభ్యాసము చేసి 1918లో పట్టభద్రులయ్యారు. ఆయన మొదట రెండు సంవత్సరాలు ఉపాధ్యాయునిగా పనిచేసి తర్వాత 10 సంవత్సరాల పాటుభావ కవిత్వోద్యమాన్ని ఆంధ్రదేశమంతటా తిరుగుతూ ప్రచారం చేసాడు. 1942లో మద్రాసు చేరుకొని సినిమా పాటలు వ్రాసారు.

కృష్ణశాస్త్రి తన 10వ యేటనే 'నందన నందన ఇందిరానాథ వరద' అనే పద్యమును చెప్పినాడు. క్రమముగా ఖండకావ్య రచనకు పూనుకొని అచిర కాలంలోనే మిక్కిలి యశస్సును ఆర్జించారు. వీరి ప్రతిభను గమనించి వేంకట పార్వతీశ కవులు తమ 'ఏకాంతసేవ'కు పీఠిక రచించమని కృష్ణశాస్త్రిని కోరినారు. నవ్యకవులకు స్వేచ్ఛ ప్రాణము. వీరు ప్రాణమైనను కోల్పోదురు కాని శృంఖలములను ధరింవరు. వీరికి ప్రాణము కన్న గానము తీపి అన్న విషయమును ఏకాంతసేవ పీఠికలో కృష్ణశాస్త్రి నవ్యకవుల మార్గమును స్పష్టము చేసినాడు.

సమాజమును పట్టి బంధించిన సాంఘిక నియమాల నుండి భాషా సరస్వతిని బంధించిన సంకెళ్ళ నుండి స్వేచ్ఛ, దుఃఖము, ప్రేమ భావన, ఈశ్వరారాధనలు కావ్య వస్తువులుగా ఆయన పెక్కు ఖండికలను రచించారు.

కృష్ణశాస్త్రి రచనలలో కృష్ణపక్షము, ప్రవాసము, ఊర్వశి, మహతి, అమృతవీణ, మంగళకాహళి (కావ్యాలు), ధనుర్దాసు, శర్మిష్ఠ, అండాళ్ (నాటికలు), మేఘమాల (వెండితెర పాటలు), అవ్వాడు వుట్టి ఉంటే, బహుకాలదర్శనం, పుష్పలావికలు, వ్యాసావళి (4 సంపుటములు) వంటి వచన రచనలు ప్రసిద్ధమైనవి. 1947లో రాష్ట్రపతి ద్వారా 'పద్మభూషణ్' అవార్డు, 1975లో ఆంధ్ర విశ్వవిద్యాలయము వారు 'కళాప్రపూర్ణ' బిరుదులను పొందినారు. ఇంకా అనేక సత్కారాలను బహుమతులను పొందినారు.

ఆధునికాంధ్ర కవిత్వంలో భావకవిత ఒక శాఖ. ఆంగ్ల సాహిత్యంలో వెలసిన లిరికల్ పాయెట్రీ, రొమాంటిసిజమ్ ఈ రెండూ తమ ప్రభావ ముద్రను మన భావ కవులపై వేసాయి. ఆధునికాంధ్ర కవిత్వంలో పరిశోధించిన ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారు భావకవిత్వం (శాఖలు) అభ్యుదయ కవిత్వం (నూత్న భేదాలు), అతినవ్య కవితా దోరణులు అని వింగడించి చూపిన కృషిలో పాఠకులకు విశేషమైన అవగాహన దక్కింది. వాటి పుట్టు పూర్వం చూస్తే ఆ భేదాలన్ని రొమాంటిక్ లక్షణాలవే అయినట్లు సూటిగా గ్రహించవచ్చును.

కాకతీయ యూనివర్సిటీ క్యాంపస్, రూం. నెం. 18, పి.ఆర్. హాస్టల్, వరంగల్ - 506 001.

భావ కవిత్వానికి ప్రారంభంలో భావగీతం అన్నారు. భావం రొమాంటిక్ ప్రభావానికి, గీతం లిరిక్ ప్రభావానికి సంకేతంగా గ్రహించవచ్చును. భావ గీతాలు మొలక ప్రాయం దాకా ఎదిగాయి గురజాడ రచనలలో (క్రీ.శ. 1900) ఆయన రూపొందించిన నవీన భావనలలో చారిత్రక పాత్రల సంఘటనల వర్ణన లాక్షణిక నియమాల ఉల్లంఘన గత పునరుజ్జీవనం, మానవానుభూతి, ఆత్మాశ్రయత ఇవి ముఖ్యమైనవి. ఇవి కాల్పనిక సాహిత్య లక్షణాలలోనివే.

భావ కవిత్వం రొమాంటిసిజమ్‌లోని అనుభూతి ప్రధానంగా కావ్య వస్తువుని తీసుకోవడం, ఛందస్సు మార్పులు ప్రవేశపెట్టడం, కొత్త కావ్య పదజాలాన్ని నిర్మించడం, ప్రకృతి గత వాతావరణాన్ని గ్రామీణుల్ని కవితలో పరిచయం చేయడం లాంటి లక్షణాల్ని అనుసరించడం. తెలుగులో భావకవిత్వం అనగానే 'ప్రణయ కవిత్వం' అని స్ఫురిస్తుంది సాధారణ పాఠకులకు. దీనికి కారణం రాయప్రోలు కాదు కృష్ణశాస్త్రి.

నానివాసమ్ము తొలుత గంధర్వలోక
మధుర సుషమా సుధాగాన మంజు వాటి
ఏ నొక వియోగ గీతిక -

ఎక్కడ వెదకినా ఇలాంటి వ్యక్తీకరణమే లభిస్తుంది. పలుకులు మార్చి చెప్పిన శృంగార రచనలు ఆయనవి.

భావ కవులలో గౌరీశంకర శిఖరం శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు. స్వతంత్రబుద్ధి కలవారు. ఆ కాలం నాటి స్వాతంత్ర్య, సంఘ సంస్కరణ ఉద్యమాల ప్రభావం కృష్ణశాస్త్రి పై పడింది. స్వాతంత్ర్యభావ తరంగములు కవి హృదయమున ఆఘాతము చేసి, కవితలో బహువిధముల వ్యక్తమయినవి. సమాజమును పట్టి బంధించిన సాంఘిక నియమాల నుండి స్వేచ్ఛను కోరుతూ కృష్ణశాస్త్రి కలం పట్టారు. ఆయనకు మనిషి మీద ఉన్న మమకారం మరి దేనిమీద లేదు. ఆయన గాయకుడు, శిల్పి, కవిత్వంలో కూడా పోగర నుపయోగించడంలో మహానిపుణులు. శుష్క చమత్కారం కోసమో, పొడి పొడిగా నాదులను పేర్చడం కోసమో కృష్ణశాస్త్రి మాటపోగులను ఎక్కడా నింపరు. ఒరులు నవ్విపోదురుగాక నాకేటి సిగ్గు అని తన స్వేచ్ఛనెప్పుడో ప్రకటించుకున్నారు.

కృష్ణశాస్త్రి నిరంతర సౌందర్యాన్వేషణ ఫలితంగా ఊర్వశి అవతరించింది.

ఎవరోహో, ఈ నిశీధి నెగసి, నీడవోలె నిలిచి
పిలుతురెవరొ, మూగకనులు మోయలేని చూపులతో
ఎవరొహో ! ఎవరొహో !

అంటూ తాను 'ప్రవాసము'ను దాటుతుండగా నీడలాగా నిశీధికి ఆవల ఎవరో నిలబడి తనను పిలుస్తున్నారని భావన చేయడం, ఆ వెంటనే ఊర్వశి కావ్యం మొదలు కావడం ఇది కవి యొక్క అన్వేషణను, అన్వేషణా ఫలితాన్ని వెల్లడించినట్లయినది. ఆ అన్వేషణ ఫలితం 'ఊర్వశి' దీనిని బట్టి ప్రవాసము ముగింపులోనే ఊర్వశి అవతరణకు బీజావాపనం జరిగిందని తెలుస్తుంది.

ఊర్వశి ఎలా అవతరించిందో కవి మొదటి గేయం 'నా కరిన పాద శిలల క్రింద...' అనే దానిలో ఇలా వర్ణించారు.

ఈ నిశావసానమ్మున, ఏ శుభాని
లమ్ము నిట్టూర్చెనో జాలి రాగ నేడు
వ్రాలె నా పాదు అడుగుల మ్రోల నొక్క
తారయే, యొక్క దివ్యమందార సుమమె !

అంతకు ముందు కృష్ణపక్షపు ప్రవాసంలో ఉన్న కవికి ఆ చీకటిలో చూడలేక పోవడం కారణంగా ఎన్నో మల్లె పువ్వులు అతని పాదాల క్రింద పడి నలిగి పోయినవి.

ఊర్వశి సాక్షాత్కారంతో కవి హృదయం గొప్ప అనుభూతికి లోనయినది. ఆ అనుభూతిని కవి ఇలా చెప్పాడు.

మోహినీహాస మల్లీ ప్రపుల్ల రుచియె,
శ్రీలలిత వైజయంతీ పరిమళమ్మొ,
హరజటా పారిజాత లతాంత మధువె,
నిర్దయా నిశితమ్ము లీ నీచనఖర
ములకొసలె కోరి పరవశమ్మున చలించె !

అని కృష్ణశాస్త్రి వర్ణిస్తాడు. భావకవిత్వ గుణములలో

అనుభూతి వర్ణన ఒకటి. కవిగా కృష్ణశాస్త్రికి గొప్ప పేరు రావడానికి ఈ అనుభూతి వర్ణన కూడా ఒకటి. బాగా వికసించిన మల్లికా పుష్పకాంతి వలెనున్న జగన్మోహనుని హసము, శ్రీ లలితా దేవి యొక్క వైజయన్తీ పరిమళం వలె, శివుని శిరస్సులో ఉన్న పారిజాత సుమ మకరందము వలె ఈ మూడింటి యొక్క అనుభూతి ఊర్వశి సందర్శనము వలన కవి హృదయంలో ఆవిష్కృతమైంది.

కృష్ణశాస్త్రిగారి కవిత్వం భావ, శబ్ద చిత్రాలకు పుట్టిల్లు. ఇవి కవిత్వంలో అభివ్యక్త విధానములో వచ్చిన కాలాను గుణమైన మార్పుకు నిదర్శనాలు. కవి ప్రతిభాశక్తి భావనా, వర్ణనా రూపంలో భావ చిత్రాలుగా శబ్ద చిత్రాలుగా ఊర్వశి రచనలో ఇట్లు కనిపిస్తుంది.

త్రిజగతీ పతి కోటీర దివ్యరత్న
రాజినేలు వజ్రాల తురాయి నీవు !
ఎనో, పాతాళలోకంపుటిరుకు సందు
లందు దిగబ్రాక వెరచు గాఢాంధ రేఖను !

ఈ పద్యములోని వజ్రాల తురాయి నీవు, పాతాళంలోకంపు టిరుకు సంధులు, వెరచుగాంఢాంధకార రేఖ - అన్నవి కవి హృదయ ప్రతీకలైన భావ చిత్రాలని తెలుసుకోవచ్చును.

కృష్ణశాస్త్రి కవితా ప్రస్థానంలో ప్రధానంగా చెప్పబడింది ప్రకృతి చిత్రణ. ప్రకృతి ఆరాధన ఆయన కవితకు ఊపిరి పోసిందన్న విషయం నిశ్చయం. ప్రకృతి కేవలం వర్ణనగానే నిలిచిపోలేదు. ప్రకృతిలో ప్రేయసిని చూశాడు. దైవత్వాన్ని చూశాడు. వధూవరులను చూశాడు. మనిషిని చూశాడు. ప్రకృతికి దైవత్వాన్ని ఆపాదించి మానవాతీత దృష్టితో దర్శించిన వర్డ్స్‌వర్త్‌లా ఆరాధించాడు.

అదృశ్యమైన వస్తువును దృశ్యమానమైన ప్రకృతిలోని వివిధాంశాలతో పోల్చి ఒక విలక్షణమైన సౌందర్యాన్ని సృష్టించడం కృష్ణశాస్త్రి కవిత్వంలో ఒక ప్రత్యేక లక్షణం.

నును మబ్బులేదున్క, కొనలపై సోనలౌ
నెలవంక చిరునవ్వు కలువపాట,

ఈ పాటలోని మనోహరత్వం అనుభూతి రమ్యమైనది. ఆ అనుభూతి సౌందర్యాన్ని వ్యక్తం చేయడానికి సాధారణ భాష తగదు. ఈ పద్యంలో నెలవంక చిరునవ్వు చలువపాట మంచు కన్నీరు పాట, గాలి నీలాలపాట, నెత్తావి కలలపాట - అన్న చిత్రాలు పాఠకుడి హృదయంలో రమ్యాలు అవుతాయి.

భాషకందని భావాలను చెప్పదలచినపుడు కవికి ఉపకరించు సాధనము అలంకారము. కవిత్వానికి ఇంద్రియ గోచరత్వం గుణంగా ఉండాలి. ఇంద్రియ గోచరత్వం కృష్ణశాస్త్రి కవిత్వంలో విస్తృతంగా కనిపిస్తుంది. అలంకార కల్పనలో కవిసాధించే శిల్పం ఈ విధంగా కనిపిస్తుంది.

నీవు తొలి పొద్దు నునుమంచు తీవసోనవు
నీవు వర్షాశరత్తుల నిబిడ సంగ
మమున బొడమిన సంధ్యాకుమారి

మొదలైన పంక్తుల్లో రూపకాలంకార చిత్రణ కవి యొక్క కల్పనాశక్తికి నిదర్శనమని చెప్పవచ్చును.

కృష్ణశాస్త్రి కావ్యాలలోని ప్రణయం అత్యంత గాఢమైనది. అది మనసు లోతులను సృజించగల శక్తివంతమైనది. లోతయిన పదాల కూర్పు వలన ఆ శక్తి సిద్ధిస్తుంది.

ఎదలోపలి యెదలో, నె
మ్మదిలో, జీవిత రహస్య మార్గమ్ములలో
వదలని కోరికవై, నా
బ్రదుకుబరువు లెల్ల పాట పాడింతు సఖీ !

'యెదలోపలి యెదలో' అనే ప్రయోగం మనస్సు యొక్క స్వరూపాన్ని దృష్టిలో పెట్టుకొని వాడబడింది. ఇక్కడ కృష్ణశాస్త్రి తన ప్రేయసిని గురించిన ప్రణయభావం రసత్వమును పొందినట్టిది. అందుకే ఎదలోపలి యెదలో నెమ్మదిలో అని వాడబడినాడు. కృష్ణశాస్త్రి ప్రణయం కేవలం బాహ్యమైంది కాదు. తాత్విక లోతులను స్పృశించినట్టిది. కాబట్టే జీవిత రహస్య మార్గములలో వదలని కోరికలై అని అన్నాడు. జీవిత రహస్య మార్గం అంటే మోక్షము లేదా

మరణము అని తాను బ్రతికి ఉన్నంత వరకూ ఆ కోరిక తనను వదలి పెట్టదని భావం. అందుకే నా బ్రతుకు బరువులెల్ల పాటపాడింతు అన్నారు.

ప్రకృతిలో తాదాత్మ్యం చెందుతూ తన మనస్సులోని భావాలను ప్రకృతి పరంగా వ్యాఖ్యానం చేయడం కృష్ణశాస్త్రి గారికి వెన్నతో పెట్టిన విద్య. 'ఆకులో ఆకునై"... అంటూ మొదలు పెట్టిన ఇతని ప్రకృత్యారాధనా తత్వం ఊర్వశి కావ్యంలోనూ ఈ విధంగా కనిపిస్తుంది.

కలువపూ బ్రతుకులో కనుమోడ్చు వెన్నెలే
కాల నలంబైన గతి యేమి !
నిరుపేద రెల్లులో నిదురించు సెలయేరె
కల్లోలమే యైన గతి యేమీ !

ఊర్వశి తనకు దూరం కావడం భరించలేక కవి రమ్యమైన ప్రకృతిలోని అంశాల వర్ణనతో తన మనస్సులో భావాలను చిత్రించారు. కృష్ణశాస్త్రి తానొక కలువగా, నిరుపేద రెల్లుగా మొదలయిన ప్రకృత్యాంశాలలో కలిసిపోతాడు. ఈ విధంగా జీవితంలోని వైవిధ్యాలను, ప్రవృత్తులను ప్రకృతిలో దర్శించగలగడం భావుకుడైన కృష్ణశాస్త్రికి మాత్రమే సాధ్యమయిన పని.

కవి హృదయం వైయక్తిక ప్రేమ నుండి విశ్వప్రేమ వైపుకు పయనించింది. వ్యక్తి నిష్టమైన ప్రేమ నుండి లోక నిష్టమైన ప్రేమ పై దృష్టి పడింది. ఆ విశాల హృదయంతో కవి విశ్వప్రేమను జీవితంలోకి ఆహ్వానించాడు.

తొలి వియోగిని నేనె
తొలి ప్రేయసిని నేనె

అంటూ ఊర్వశి కవికి ఆవేశమును ఇచ్చినది. 'ఆ నాటి కీ నాటి కేను నీ దాననే!' అని తమ మధ్యగల దృఢమైన అనుబంధాన్ని ప్రకటించినది. అంతేకాదు ఊర్వశి కవి భావనలో స్నానమాడి మానవత్వ గంధమలముకొన్నది. ఆమె అతని 'జీర్ణ జీవిత ప్రాంగణమున' ప్రవేశించగనే అతని ముదుసలి నిరాశలు నీడలై పరుగు దీసినవి. అతని బ్రతుకు నందన చైత్రమైంది. ఎప్పుడైతే కవికి ఊర్వశి దర్శనం కలిగిందో ఆమె తనపై ప్రేమ ప్రదర్శించిందో అప్పటి నుండి కవి హృదయం విశ్వప్రేమ వైపు పరుగులు తీసింది.

కవి హృదయంలోని విశ్వవీణాగళమ్ము భోరు భోరున మ్రోత పెట్టినది.

నా హృదయ మందు విశ్వవీణాగళమ్ము
భోరు భోరున నీనాడు మ్రోతపెట్టు;
దశదిశా తంత్రులొక్క సుధాశ్రుతిని బె
నంగి చుక్కల మెట్లపై వంగి వంగి
నిలిచి నిలిచి నృత్యోత్సవమ్ముల చలించు,

అని వర్ణించాడు. తన విశ్వప్రేమ భావన దశదిశా తంత్రుల వ్యాపించాలని అనగా భువనభోంతర పరివ్యాప్తం కావాలని తన యీ సుధాశ్రుతి ప్రేమ వాక్కు చుక్కల నంటి నృత్యోత్సవమ్ము లాడాలని కృష్ణశాస్త్రి తన విశ్వవీణా గళంతో పాడుతున్నాడు. విశ్వప్రేమ భావనను కవి ఇంత సుందరంగా వర్ణించడం అపూర్వమైన విషయం.

ఈ విధంగా ఊర్వశి కావ్యంలో కృష్ణశాస్త్రి ప్రతిపాదించిన వివిధ కవితా సౌందర్యాంశములు ఒక అపురూపమైన నమ్మేళనమును పొంది అలౌకిక సౌందర్యానుభూతిని ఆవిష్కరించినది. అందుకే 'ఊర్వశి' ఊహ ప్రేయసి అందని ఆనంద ధుని ఆంధ్రులకు అభినవ గీతాంజలి.

ఆరుద్ర అన్నట్లుగా

కొంత మందిది యువత
కొంత మందిది నవత
కృష్ణశాస్త్రిది కవిత
ఓ కూనలమ్మ... , అనునది అక్షర సత్యం.

జీవితమంతా ఆయన వెదికిన ఊర్వశి భూమిపై లేదని తెలిసికొని "దిగిరాను దిగిరాను దివి నుండి భువికి' ' అంటూ ఆమె నులివెచ్చని కౌగిలిని వెతుక్కుంటూ 1980 ఫిబ్రవరి 24వ తేదీన దివి సీమలకు వెళ్ళిపోయారు.

❋ ❋ ❋

# మరపురాని మధురకవి - కరుణశ్రీ

- శంకరమంచి శ్యాంప్రసాద్

"ఏకో రసః కరుణఏవ" అన్న భవభూతి వాక్కుకు ప్రతీకగా కరుణ లేకపోతే కవికి వ్యక్తిత్వం లేదు. కవి లేకపోతే కరుణకు అస్తిత్వం లేదు అన్న సిద్ధాంతాన్ని త్రికరణశుద్ధితో ఆచరించి, ఆరాధించి, ప్రబోధించిన మహాకవి డా॥ కరుణశ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు. 1912 ఆగస్టు 4న గుంటూరు జిల్లా కొప్పర్రు గ్రామంలో జన్మించిన వారు సంప్రదాయ విద్యలను అభ్యసించి, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు నుండి "ఉభయభాషా ప్రవీణ" పట్టాన్ని పొందారు. ఆంధ్రక్రైస్తవ కళాశాల - తెలుగుశాఖలో చాలాకాలంపాటు ఆచార్యులుగా పనిచేశారు. "కరుణశ్రీ" పేరు వినగానే తెలుగువారికి స్ఫురించేవి వారి "పుష్పవిలాపం" పద్యాలు. మధురగాయకులు ఘంటసాల వీటిని గానం చేయడంతో బంగారానికి పరిమళం అబ్బినట్లైంది.

ఆధునిక యుగంలో పద్యసాహిత్య ప్రస్థానానికి ప్రాచుర్యం, ప్రాభవం కలిగించిన ప్రముఖ కవుల్లో పాపయ్య శాస్త్రిగారు అగ్రగణ్యులు. ధారాశుద్ధికి, శబ్ద సౌందర్యానికి, భావ గాంభీర్యానికి పట్టుగొమ్మలు వారి పద్యాలు. 'కరుణశ్రీ' కవిగా మాత్రమే గాకుండ విమర్శకులుగా, సమీక్షకులుగా, వక్తలుగా లబ్ధ ప్రతిష్టులు. వారి ఉదయశ్రీ, విజయశ్రీ, కరుణశ్రీ కావ్యాలు సకలాంధ్ర దేశాన్ని పులకింపజేసిన కావ్యరాజాలు. తెలుగుబాల (శతకం), అరుణకిరణాలు, కరుణామయి, బాలకోటేశ్వర తారావళి, శ్రీనివాసోదాహరణం, ఆనందలహరి అనేక కృతులను రచించడంతో పాటు విమర్శనా రంగాన్ని సైతం సుసంపన్నం చేశారు. తమ విశిష్ట సాహిత్య వ్యక్తిత్వం ద్వారా పండితులను, పామరులను అలరింపజేసిన అరుదైన కవుల్లో అగ్రగణ్యులు కరుణశ్రీ. 'కవిత్వం' అనేది ఎలా ఉండాలోనని చెబుతూ

*"కలువలు పూచినట్లు చిరుగాలులు చల్లగ వీచినట్లు, తీవలు తలలూల్చినట్లు పసిపాపలు చేతులు సాచినట్లు క్రొవ్వలపులు లేచినట్లు చెలువల్ చెలువమ్మగ చూచినట్లుగా పలుకుట పూర్వపుణ్య పరిపాకముగాదె తలంచి చూడగన్*

అంటూ

నిర్వచించారు. ఇటీవల కొంతమంది 'ఆధునికులు' అయిన విమర్శకులు పద్యం పాత ప్రక్రియని పనికిరానిదని ఆధునిక భావజాలానికి వాహిక కాలేదని, సామాజిక స్పృహ లేనిదని విమర్శను గుప్పిస్తూ 'పద్యం'పై దాడి జరుపుతున్న ప్రస్తుత తరుణంలో పాపయ్యశాస్త్రిగారి పద్యాలే ప్రత్యుత్తరంగా, ప్రతివాదంగా నిలువగలుగుతాయి. ఉదాహరణకు

*ప్రేయసి ప్రేమలోన కనిపించెడి, తీయని స్వర్గమొక్కటే ధ్యేయము గాదు హీనులతి దీనులు మ్లానతనుల్ దరిద్రనారాయణు లేడ్చుచుండిరి. తదశ్రువుల్ దుడువంగ బొమ్మినీ ప్రేయసి తోడ నీకట లభించును కోట్ల కొలది స్వర్గముల్*

- అన్న పద్యం

కరుణశ్రీ గారి సహానుభూతికి, మమేకత్వానికి మంచి నిదర్శనం. కాసులున్న చోటగాకుండ కష్టం, కన్నీళ్ళున్న చోటనే కవిత్వం ఉండాలని ఉంటుందని నిరూపించిన కవి కరుణశ్రీ. పరిసరాలను పరిశుభ్రం చేస్తూ మన పొట్టలోనున్నది తన తట్టలోనికి ఎత్తుకునే 'పాకీపిల్ల'ను గూర్చి రాస్తూ

తెలుగు అధ్యాపకులు, పాలకుర్తి, వరంగల్ జిల్లా - 506 252

*ఒక్క రోజీవు వీధుల నూడ్వకున్న*
*తేలి పోవును మాపట్టణాల సొగసు*
*బయట పడునమ్మ బాబుల బ్రతుకులెల్ల*
*ఒక్క క్షణమీమ్మవు గంపక్రిందకు దింప*

- ఇక్కడ

కవికి కష్టజీవి పట్లగల 'దృక్పథం' అవగతమవుతుంది. వస్తువు ఎన్నికలో, శైలిలో, శిల్పంలో, రసపోషణంలో కరుణశ్రీ ప్రతిభ అబ్బురమనిపిస్తుంది. భాషకు తగిన భావం, భావానికి తగిన భాష కరుణశ్రీ కావ్యంలో 'మణిప్రవాళంలా' గోచరిస్తుంది. డా॥ నండూరి రామకృష్ణమాచార్యులగారు పేర్కొన్నట్లు "కరుణశ్రీ కవితలో కొన్ని శబ్దాలు శిరీష సుకుమారాలు, కొన్ని శబ్దాలు వజ్ర కఠోరాలు, కొన్ని శబ్దాలు తరంగాలవలె పైకి లేస్తాయి. కొన్ని శబ్దాలు తురంగాలవలె పరిగెత్తుతాయి". స్నిగ్ధ సుకుమారియైన కుంతీ కుమారిని వర్ణించిన సదర్భంలో ఎంత చమత్కార విన్యాసం తొణికిసలాడుతుందో చూడండి.

*ముని మంత్రమ్మునొసంగనేల?*
*ఇడెబో మున్ముందు మార్తాండు ర*
*మ్మని నేకోరగనేల? కోరితినిబో యతండు*
*రానేల? వ*
*చ్చెనుబో కన్నియ నంచునెంచక ననున్*
*జేపట్టగానేల? ప*
*ట్టెనుబో పట్టినొసంగనేల? అడుగంటెన్ కుంతి*
*సౌభాగ్యముల్*

అని పేర్కొంటారు. పాఠకునిలో 'ఉత్సుకతను' కల్గించే రచనా విన్యాసం అది. యతి, ప్రాసలు వీరికి సహజ కవచ కుండలాలంటే అత్యుక్తి కాదు. శివ ధనుర్భంగ సందర్భమున

*ఫెళ్ళుమనె విల్లు గంటలు ఘల్లుమనియె - గు*
*భిల్లుమనె గుండె నృపులకు ఝల్లుమనియె*
*జానకీ దేహమొక నిమేషమ్ము నందే*
*నయము, జయమును, భయము విస్మయముగదుర*

అన్న పద్యం సన్నివేశాన్ని కళ్ళకు కట్టినట్లు చూపించే నాటకీయ శిల్పానికి నిదర్శనంగా నిలుస్తుంది. అందుకే నదీరా ఒకచోట

*"కరుణశ్రీ కలం*
*ఘంటసాల గళం*
*రసజ్ఞుల పుణ్యఫలం"* అని ప్రశంసించారు.

సరళసుందరంగా, భావబంధురంగా, రస రామణీయకంగా తెలుగు పద్యాన్ని ఎంత మార్దవంగా, రాయడానికి వీలుందో అంత హృద్యంగా, ఆస్వాద్యంగా రాశారు కరుణశ్రీ. పద్యకవితను ప్రజాస్థానానికి తీసుకువెళ్ళిన ప్రతిభామూర్తి ఆయన

*అంజనరేఖ వాల్గనుల యంచులుదాట మనోజ్ఞ మల్లికా కుంజములో సుధామధుర కోమల గీతిక లాలపించు ఓ కంజ దళాక్షి; నీ ప్రణయగానములో పులకింతునా - మనో రంజని! పుష్పవృష్టి పయిరాల్చినినున్, పులకింపజేతునా*

వంటి

పద్యాలు విని పులకించని తెలుగువారుండరు. 'విజయశ్రీ' కావ్యం ద్వారా భారత జాతీయోద్యమానికి యువతరాన్నే ప్రేరేపించిన కవి ఆయన. స్వాతంత్ర్యోద్యమాన్ని స్ఫురింపజేసిన విశిష్ఠ కావ్యం ఇది. రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని మట్టుబెట్టడానికి తమదైన ప్రత్యేక పంథాలో ఉద్యమించిన జాతీయ నాయకులను గూర్చి కరుణశ్రీ వ్రాసిన పద్యాలు చిరస్మరణీయాలు. సత్య, అహింసల ద్వార మొత్తం స్వాతంత్ర్యోద్యమానికే సారధ్యం వహించిన మహాత్ముణ్ణి స్తుతిస్తూ

*సీ॥ నలుబదికోట్ల తమ్ముల జీవితమ్ముల*
*కాయన మాట వేదాక్షరంబు*
*భీరులనే కర్మవీరులగావించు*
*ఆయన పిలుపు శంఖారవమ్ము*
*సత్యంబు, శాంత్యహింసలకు స్వాగతమిచ్చు*
*ఆయన బ్రతుకు మహాప్రయాగ*
*కొల్లాయితో పిచ్చి పుల్లాయివలె నుండు*
*ఆయన దీక్ష లోకైక రక్ష*

గీ॥ అతడొక పవిత్ర ధర్మదేవాలయంబు
అతడొక విచిత్ర విశ్వవిద్యాలయంబు
ఆ మహాశక్తి ఇంతయంతయనుచు తూచజాల
అతడొక పెద్ద హిమాలయంబు

అన్న పద్యం గాంధీ వ్యక్తిత్వానిక పట్టిన నిలువెత్తు నీరాజనం. దేశభక్తుల త్యాగంతో సిద్ధించిన స్వాతంత్ర్యఫలం - అనంతర కాలంలో సామాన్యునికి అందని ద్రాక్షగానే మిగిలిందని దీనికి కారణం కుటిల రాజకీయాలు స్వార్థం, విద్రోహం, అశాంతి, హింస, యుద్ధోన్మాదం, అహంకారమేనని చెబుతూ అసలు అఖిలాండమే అగ్నిగోళంగా మారడంతో వ్యథ చెందిన "కరుణశ్రీ" ఈ సమాజానికి, ఈ దేశానికి, ఈ వ్యవస్థకు శాంతి సౌఖ్యాలను ప్రసాదించడానికి విచ్చేయవలసినదిగా బుద్ధున్ని పునరాహ్వానిస్తూ

*హింసాశక్తులు రక్తదాహమున దండెత్తెన్; దరిద్ర ప్రజా సంసారమ్ములపై; పురోగమనముల్ స్తంభించె;*

*ధ్వంసంబయ్యె: కిరాత శాత శరవిద్ధంబైన యుద్ధారుణీ హంసన్ గాయము మాన్పి కావవలెనయ్యా, రమ్ము వేగమ్ముగన్*

అన్న పద్యం వర్తమాన సామాజిక స్థితిగతులకు ప్రత్యక్ష నిదర్శనం. విశ్వగోళంపై సామాన్యుడు ఎక్కడ వంచింపబడ్డా స్పందించిన కవి కరుణశ్రీ "భిన్నత్వంలో ఏకత్వం". అన్న భారతీయ సంప్రదాయమని : అది పరిరక్షింపబడినపుడే దేశాభివృద్ధి సాధ్యమౌతుందని ఆయన అభిప్రాయం. యువతరం గతవైభవ పునస్మరణతో స్ఫూర్తిని పొంది, నైతిక విలువలను పెంపొందించుకొని సమసమాజ నిర్మాణానికి నాంది పలకాలన్న వారి ప్రబోదం ఆచరణీయమైనది అనుసరణీయమైనది.

- హృద్యమైన తెలుగు పద్యం ద్వారా సాహితీ సేద్యం చేసిన కరుణశ్రీ గారు 21-06-1992 నాడు అస్తమించారు. పద్యానికి పాపయ్య శాస్త్రిగారికి అవినాభావ సంబంధం. అందుకే ఈ వ్యాసకర్త తన "సత్యవాణి" శతకంలో

పద్య కవిత యనగ పాపయ్యశాస్త్రియే
జ్ఞాపకమ్ము వచ్చు జగతికెల్ల
పద్యవిద్యకతడు పర్యాయ పదమయ్యె
శ్యాము వాక్కునమ్ము సత్యవాక్కు" - అని

పేర్కొనడం జరిగింది. కరుణశ్రీ గారికి 'పోతన' అభిమాన కవి. కనుకనే ఆ మహాకవిని స్తుతిస్తూ "పంచదారలో నద్దితివేమొ గంటము మహాకవి శేఖర" అని చెప్పిన ఈ ప్రయోగం అక్షరాల వీరికి గూడ వర్తిస్తుంది. వీరికి లభించవలసినన్ని పురస్కారాలు లభించనందుననేమో డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులగారు

"కవులల్లో ఉన్నారు కరుణశ్రీలు
కష్టపడి వ్రాశారు ఉదయశ్రీలు
కష్టపడకనే తెస్తారు మన నాయకులు
పార్టీలను మార్చడంలో పద్మశ్రీలు" అని తమ

తెలుగు రుబాయిల్లో పేర్కొన్నారు. కరుణశ్రీ బహుముఖీన ప్రతిభను కొనియాడుతూ డా॥ సి. నారాయణరెడ్డిగారు "పద్యాన్ని మాటగా పాటగా, సూక్తిగా, స్ఫూర్తిగా మలచిన చతుర చతురాననుడు కరుణశ్రీ. కళ్ళ నిండా దయ, కవిత నిండాలయ' ఉన్న సాధువర్తనుడాయన" - అని పేర్కొన్నారు. "భావకవితాయుగపు సంధ్యాకిరణం కరుణశ్రీ" యని గుంటూరు శేషేంద్ర శర్మగారు కరుణశ్రీ కవితా తరంగాలు - భావుక జనుల అంతరంగాలు, వాణీ విలాస లాస్యరంగాలు అని పేరాల భరతశర్మగారు పేర్కొన్నారు. కరుణశ్రీ కావ్యాలు చదివి ప్రభావితులైన ప్రముఖ చలన చిత్రనటులు గుమ్మడి తన కూతుళ్ళకు ఉదయశ్రీ, విజయశ్రీ అని పేర్లు పెట్టుకొన్నట్లు ఒక సాహితీ సభలో చెప్పారు.

"ఉదయశ్రీ నా హృదయం
విజయశ్రీ నా శిరస్సు
కరుణశ్రీ నా జీవితం" అన్న వారి మాటలతో

ఏకీభవించని ఆంధ్రుడుండడు. ఉంటే ఆంధ్రుడు కాదేమో! తన అసమాన కవితా ఝరితో ఆంధ్రులందరిని అలరించి అమరులైన మధురకవులు - మహాకవులు డా॥ కరుణశ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు.

"సుకవి జీవించు ప్రజల నాలుకల యందు" (జాషువ)

# దళిత కవిత మట్టి గుండె చప్పుళ్ళు

- బొల్లు నర్సింగ్‌రావు

దళిత కవిత "మట్టిగుండె చప్పుళ్ళు" కవితా సంకలనం ద్వారా డా॥ దేవరాజు మహారాజు దళిత కవిత్వోద్యమానికి తన వంతు చేయూతను అందించారు. మరాఠీ భాషలోని దళిత వాద కవితలను తెలుగులోకి అనువదించి మరాఠా దళిత కవుల స్ఫూర్తిని, సృజనాత్మకతను తెలుగు దళిత కవితలో కలగజేయడానికి దోహదపడుతుందనడంలో సందేహం లేదు.

పేదవాని ఆవేశాగ్నికి ధనవంతుల దోపిడి ఆహుతి అవుతుంది, అది ఎంతో దూరం లేదు అనే భావన మనకు 'త్రియంబక్ సప్‌కాలే రచించిన' రక్షణ కవితలో కనిపిస్తుంది. పుస్తకంలోని బొమ్మల్లో ఒక ధనవంతుడు బీదవాణ్ణి తన్నడం, చంపడం చూసిన పిల్లవాడు ధనవంతుడు ఎత్తిన చేయిని చెక్కేశాడు అంటే ఇక్కడ కవి వచ్చే తరంలోనైనా ఈ ధన వంతుల దురాగతాలను తిప్పికొట్టే మనుషులు పుడతారని ధనవంతులను తరిమికొట్టే తరుణం ఆసన్నమయిందని ఉన్నవాడు లేనివాడు అనే తారతమ్యాలు లేకుండా పోవాలనేది కవి ఆకాంక్షగా మనకు స్పష్టం. ప్రతి పేదవాడు దళితుడే అన్న విషయం మీద ఈ కవిత సాగుతోంది.

వహరు సోనావనె 'ఆధునిక ఆటవిక యుగం' కవితలో ఆనాడు అడవిలో రాలిపడిన పెద్ద వెడల్పాటి టేకు ఆకుల్లాగా దూరంగా గుడిసెలు అయినా వారు ఆదివాసులంతా కలిసి మెలిసి వ్రేళ్ళూ, కందములు, దుంపలు తిన్నారు. మరి నేడు నాగరికత నేర్చినా కూడా అప్పటి ఆహారం కూడా దళితులకు అందుబాటులో లేకుండా చేశారు. అపుడు చెట్లున్న అడవిలో ఆకులు, అలమలు లభించేవి కాని నేటి ఆధునిక ఆటవిక మనుషులున్న అడవిలో అవి కూడా కరువయ్యాయి అని వేదన తెలియజేయడం కనిపిస్తుంది.

పిల్లలు నగ్నంగా
గుడిసెల ముందు బురదలో
ఆటవికంగా ఆడుకుంటున్నారు?

మేమే కాదు మా పిల్లలు కూడా అదే జీవితాన్ని గడుపుతున్నారు. మేము ఆకులనే వస్త్రాలుగా ధరించి శరీరాన్ని రక్షించుకున్నాం, కాని మా పిల్లలకు అవి కూడా లేకుండా చేస్తున్న ఈ ఆధునిక యుగంలో దళితుల జీవితాలను ప్రతిబింబించే ఒక దర్పణం ఈ కవిత.

భీమ్‌సేన్‌దితే రాసిన "గొంతు పెగలని పాట" అనే కవితలో పెత్తందారు పాట పాడమంటే మా అయ్య పాడతాడు మరి ఎందుకంటే వాడు కొంత గంజిపోస్తాడు కాబట్టి, పని చేసి సాయంత్రం ఇంటికి ఒంటరిగా దారి పట్టినపుడు

"రొట్టె పాట కోసం తడుముకు చచ్చేవాడు"

అనడంలో దళితులు పెత్తందారు కింద అణిగిమణిగి ఉండడమే కాక వానికి ఇష్టం వచ్చినపుడు పాటలు పాడతారు, వారినే గొప్ప వ్యక్తులుగా చేసి పొగుడుతారు. కాని దళితులు తన జానెడు పొట్ట కోసం రొట్టె ఏమిటి? మెతుకులు ఎందుకు తినడం లేదు నాకెందుకు ఈ గతి? తనవారి బాధలు ఇతరులకు తెలియజేసే, వాటికి సరైన పరిష్కారం చూపే పాటలు పాడాలంటే ఏ ఒక్క దళితునికి "ఎంత కొట్టుకు లాడినా పాటరాదు" అని కవి బాధపడడం మనకు ఈ కవితలో కన్పిస్తుంది. దళితులు దళితుల కోసం పాటలు రాసుకొని పాడుకొని, ఆ బాధలకు కష్టాలకు గల పరిష్కారాలను అన్వేషించి తగిన నిర్ణయాలు తీసుకోవాలని కవిత చాలా ఆవేశంగా తెలియజేస్తుంది.

ప్రశాంత్ భరత్ రాసిన "కళ్ళుమూసిన ఆకాశం" కవిత దళితుల కళ్ళను తెరిపించడం కోసమే అని చెప్పవచ్చు.

ఆకాశం - రుతుపవనాల్ని రప్పించి వర్షం కురిపించదు.
ఆకాశం - మండుతూ రాలే పిడుగుల్ని పుట్టించదు.
ఆకాశం - తన విస్తరణకు తను హర్షించదు.

ఇ-టు-హాస్టల్, రూం. నెంబర్ - 27, ఒ.యు. క్యాంపస్, హైదరాబాదు - 500 007.

ఆకాశంను దళితునిగా భావించి ఈ కవిత సాగుతుంది. దళితుడు దళితునికి తన సహాయ సహకారాలు అందించడు, ఎవరినన్నా దళితులు కాని వారు దాడి చేస్తే ఆ సంఘటనను ఎదుర్కొనుటకు సన్నద్ధం కాడు, ప్రపంచవ్యాప్తంగా దళితులున్నారని (తను) దళితుడు సంతోషించడు ఇదే భావన దళితులను ఐక్యం చేయలేక పోతూంది అనేది ఈ కవిత స్పష్టం చేయుటకు ప్రయత్నించింది. ఆకాశం అంత ఎత్తున ఉన్న దళితుడు భూమి మీద ఉన్న తన వారు దళితులంతా అనే స్పృహ రాదనేది తెస్తుంది -

"గోడలు కుట్రలు పన్నుతున్నాయ్" కవితను డి.యస్. డుధాల్కర్ రాశారు.

ఈ మధ్యే కాంట్రాక్టు తీసుకున్నాను
భవనాల గోడలు కూలగొట్టడానికి
గోడలున్న భవనాలే కాదు
గ్రామాలు, పట్టణాలు కూడా !

కాంట్రాక్టు అనే ఉద్యమం ద్వారా భూస్వాముల భవనాలను కూలదోయుటకు వెనుదిరగను, ఇది నేనయి నేను ఎన్నుకున్న పని అని కవిత ద్వారా తెలుస్తుంది. ఈ గోడలు మన మీదనే దళితులపైనే కూలుతున్నాయి. ఎందుకంటే అవి నల్లమందుకు బానిసలయినాయి అందుకే వాటిని కూలగొట్టుటకు, సిద్ధంగా ఉన్నానని కవిత దళిత వాదాన్ని చాటేలా ఉంది.

మా గూడెంలో 'కేశన్‌మేష్‌రామ్' రాసిన కవిత దీనిలో దళిత జీవుల ఇళ్లు, వారి ఆలోచనా విధానాన్ని తెలియజేయడం జరిగింది. "బురదలో పశువు కాలి గుర్తుల్లాగ మా ఇళ్ళు" అంటే అవి వర్షానికి, చలికి, ఎండకి అనువైన స్థిరమైన ఇళ్లు కావు అయినా ఆ ఇళ్ళలోనే జీవనం గడుపుతున్న బడుగు జీవులని తెలుస్తుంది.

"సంప్రదాయపు చట్రాల్లోంచి బయటపడి
భూమిలో ఇంకిపోతూ"
.... ఉవ్వెత్తున లేచిపడే

తిరుగు బాటు సముద్రం - " దళిత జీవులంతా సంప్రదాయ బంధనాలను తెంచుకొని, తమ సొంత సంస్కృతిని నిలుపుకొంటున్నారు. సముద్రంపై అలలు ఒక దాని తర్వాత ఒకటి వేగాన్ని పుంజుకొని తీరాన్ని తాకినట్టు దళితులంతా పోరాటానికి తమ ఉనికిని కాపాడుకోవటం కోసం ఒకే సముద్ర కెరటంలా (కెరటాల్లా) ఎగిసిపడాలని కవి కోరిక.

అరుణ్ కాంబ్లే రాసిన "వాళ్ళు ప్రకటించారు", అనే కవితలో 'మా పాదాలకు విముక్తి ప్రసాదిస్తామని! నిన్న వాళ్ళందుకే ప్రకటించారు. మాకు గుక్కెడు నీళ్ళు ప్రసాదిస్తామని!! ఇక్కడ కవి దళిత వీరులు (మమ్ములను) దళితులను విడిపిస్తానన్నారు. అలాగే మంచినీళ్ళు అందిస్తామని అయినా మేము వాళ్ళను నమ్మలేదు అని దళితులు బాధ పడడం కన్పించుసు.

పక్షిని కవితా వస్తువుగా తీసుకొని 'నరేంద్ర పాటిల్ నిశ్వాసలతోనే.' అనే కవితా రాశాడు. దీనిలో పక్షిగా దళితుడు కన్పిస్తాడు. దళితుల ఆలోచనలను, వారి కలలను, చీకటి భూగృహంలో బంధించే ఎంతకాలం ఉండలేరు, వారి నిశ్వాసాలకే భూగృహ గోడలు వణుకుతున్నాయి". మరి దళితులు ఉచ్ఛ్వాస తీస్తే అంతా మాయం అవుతుంది, అని దళితేతరులను హెచ్చరించే రీతిలో చాలా బాగుంది.

బడికి పోనీయ్ : అనే కవితలో వామన్ కోదక్ కవి దళిత యువకులకు ఉత్తేజాన్నివ్వడానికి రాశాడని చెప్పవచ్చు. ఈ కవితలో ఒక దళితుడు తన కొడుకు పైన పెట్టుకొన్న ఆశల్ని చాలా విశదంగా తెలిపాడు.

'వాని కాలిమేజోల్లు అరువు దెచ్చుకున్నవే గావొచ్చు'

కాలిజోడు కూడా కొనివ్వలేని దళితుడు తన కొడుకును చదివించడానికి మొక్కవోని విశ్వాసంను రంగరించి తన కొడుకుకు అందిస్తాడు.

మా పిలగాడు తెలివి నేర్వాలె
పెద్ద లాయరు వకీలు గావాలె"

దళితులలో ఒకడు తెలివి గల వాడయితే దళితులందరిని ఆదుకుంటాడు, అదే విధంగా వాడే పెద్ద లాయరవుతే అన్యాయం జరుగుతున్న దళితుల న్యాయం కోసం పోరాడుతాడని, వాడే నాకొడుకయితే నాకెంతో సంతోషం అని ప్రతి దళితుడు కోరుకోవాలనేది ఈ కవి కోరిక.

వలస పక్షులు కవితలో బాపూరావ్ జగ్‌తాప్ గారు దేశం దళితులను ఏ విధంగా హీనచూపు చూస్తోందో

తెలియజేశారు. హృదయం లేని మతంతో దేశం నగ్నంగా నిలబడి ఉంది.

ఈ దేశ మతంలో మనస్సు లేదు, దళితులను ఆ మతం అంటరాని వారని, ముట్టరాని వారని హేళన చేస్తున్నా ఏమి చేయలేని నిస్సహాయ స్థితిలో దేశం ఉంది కాబట్టి చస్తే "నాలుగడగుల ప్రశాంతస్థలం దొరికే చోటికి!!! పోదాం వలస అని కవి ఆవేదన చెందడం కన్పించును.

ఉత్తమ్ కోల్గాంకర్ దళితుడు అతని ఇల్లు ఏ విధంగా ఉంటుందో, అతని దౌర్భాగ్యజీవితాన్ని మనకు "గృహమంటే కదా స్వర్గసీమ"లో తెలియజేశాడు.

అతడు పుట్టింది ఇక్కడే
కాని ఇక్కడి వాడు కాదు?

దళితుడు పుట్టిన దేశం ఇదే కాని అతడు పుట్టింది దళితుడుగా కాబట్టి అతను ఇక్కడి కాదు అనేది తెలియడం జరుగుతుంది. దళితుల్ని సమాజం ఏ విధంగా ఎత్తి చూపుతుందో దాన్ని ఖండించడం కవిత భావం. దళితుడు పట్నం వీధుల్లో అడుగుపెడితే ఎవరు అతన్ని చూడరు చూసిన వాళ్ళెవరైనా ఉంటే తమలో తాము

"వింతగా గుసగుసలు చెప్పుకుంటారు
గాజు గ్లాసులు పగిలినట్టు
గాయపు నవ్వులు నవ్వుతారు"

నాడు దళితుడుగా పుట్టిన ప్రతివాడు ఒక రకమైన వేషధారణ ఉండాలని సంప్రదాయులు కల్పించారు అతడు కన్పిస్తే నాగరికత నెరిగిన నాగరీకులు కూడా గుసగుసలు, నవ్వులు విసురుతారనేది నిత్యసత్యం అని ఈ కవిత ద్వారా తెలుస్తోంది.

"ప్రకాశ్ చంద్ర కరండికర్" వార్తాపత్రికలో రోజు కనిపించే సంఘటనలు, చదివే, వినేవి అందులో

మానవత్వాన్ని మంటగలిపి సాగించిన హరిజన
స్త్రీ శారీరక దోపిడి

మానవత్వంనే మరచి కరడుగట్టిన కామాంధులు హరిజన స్త్రీని దోపిడీ చేసుకొనే విధమును కవి ఆ-మెన్ కవితలో హృదయ ఘోషను వెల్లడి చేసుకొనెను.

"దిష్టి బొమ్మలా ఒక మురికిబట్టల కుర్రాడు
పాలరాతి గచ్చు... పాకుతూ తుడుస్తున్నాడు!"

దిష్టిబొమ్మలో అంటే భయంకరంగా, హృదయ వికారంగా ఉన్న దళిత కుర్రవాని వేషధారణను చూసిన కవి హృదయం దహించుకుపోయినట్టు, పతితల హృదయం కూడా తల్లడిల్లేటట్లు తన కవితలో "బాల కార్మికుల జీవితం తెలియజేశాడు."

భావుపంచ్‌భామ్ అనే కవి రోజు సమాజంలో జరుగుతున్న సంఘటనలను దళితులపై జరిగే దాడులను 'ఎలా?' అనే కవితలో రాశాడు. శత్రువు శత్రుత్వాన్ని పెంచుతున్నపుడు స్నేహం ఎలా చేయను, నరమేధం జరిపించే నగరాన్ని నాదని ఎలా ఒప్పుకోను, శత్రువుతో స్నేహం, నగరాన్ని నాదని చెప్పడం నావల్ల కాదని కరాఖండిగా చెప్పినాడు కవి,

ఒక వైపు గుడిసె వాసులంతా
అగ్నికి ఆహుతవుతున్నపుడు
ఈ మలుపును వెలుగులతో నేనెలా వెలిగించను?

దళితుల గుడిసెలకు నిప్పునై నేను తగల పెట్టుతున్నాను, మరినేనే మూల మలుపుల దగ్గర ధనవంతులకు దారి చూపుతున్నాను. అందుకే అగ్నినైన నేను ఏ వెలుగు వెలగాలి అని 'అగ్ని' కూడా దళితులకు హాని చేయడం ఇష్టంలేదని తెలుస్తుంది.

"తప్పు సరిదిద్దుకో" కవితలో అంటరానివారు ఎవరికి వారు గొప్పవారమని, అన్ని కులాలతో మంచిగా కలిసిమెలిసి ఉంటూ అంటరాని వాళ్ళు అంటరానివాళ్ళుగా చూసుకోవడం దురదృష్టకరం అని "బాబూరావు బగుల్" తెలియజేయడం, అంటరాని వారినందరిని ఒకే త్రాటిపై నడిపించుటకు చేసిన ప్రయత్నం.

చెప్పండి చూద్దాం - ఏం సమాధానమిస్తారో.....
అంటరాని వాడు ఎవరూ అనంటే
నేనే - అని నిస్సంకోచంగా ధైర్యంగా చెప్పుకోగలరా?

విదేశాల్లో మతం, కులంలకు ప్రాధాన్యత లేదు, అటువంటిది దేశాలకు వెళ్ళక ఇక్కడే ఉన్న ఆత్మద్రోహులను (దళితులను) ప్రశ్నిస్తున్నాడు కవి. అంటరాని వాడను నేను అని ధైర్యంగా చెప్పగలవాడు ఎవరు లేరని కవి చెప్తూ 'నీకు నీవు గుర్తింపునిచ్చుకో' అంటరాని వారు ఎవరికివారు మేమే గొప్ప అని చెప్పుకోవడం వల్లే ఐక్యత లోపించిందనేది కవి భావన చాలా బాగుంది. ఇప్పటికైనా తప్పును సరిదిద్దుకొని దేశాన్ని వదిలి వెళ్ళండి లేదా మీరు ఈ

స్థాయికి రావడానికి కారణమయిన వారిపై యుద్ధం ప్రకటించి నిరంతరం ఘర్షణ పడండి అని కవి దళితులను ఉత్తేజితులను చేశాడు.

పుట్టాలా వద్దా ఈ దేశంలో?పుట్టిన దళితుడు తల్లితో అమ్మా నీవు నేను పుట్టినపుడు ఎన్ని కష్టాల్లో ఉన్నావో చెప్పావు అందుకే నీ గర్భంలో ఉన్నపుడే నేను పుట్టాలా వద్దా ఈ దేశంలో? అని సందేహం కలిగిందని దారిద్ర్య అంధకారంలో నున్న ఈ దేశంలో పుట్టడం తప్పని శిశువుగా గర్భంలో నిర్ణయించుకోవడం ఇక్కడ సహజత్వం కనబడుతుంది.

తరతరాల దారిద్ర్యం మీ శరీరాల్ని కప్పినపుడు
అవసరాల తలదిండ్లతో రాత్రుళ్ళు నిద్రపోతున్నపుడు
పగలంతా చేతులు నలుపుకుంటున్నపుడు....

తరతరాల తాతల నాటి నుండి మనల్ని విడిపోకుండా అంటుకున్న దారిద్ర్యం, పగలంతా ఆహారం సమకూర్చుకునేందుకు చేతులు నలుపుకుంటుంటే చూసి నేను ఈ దేశంలో పుట్టాలా వద్దా? అని సందేహ పడ్డాను అని తల్లితో అనడం ఇక్కడ కవి దేశ దౌర్భాగ్య స్థితిని హేళన చేయడం మనకు స్ఫురిస్తుంది.

అలవాటు కవిత ద్వారా 'ఎఫ్.ఎం.షిండె, కవి బాధలు అలవాటు చేసుకుంటే కష్టముండదు, అని

ఎముకల నిండా బురద చిమ్మినా, ఎగిరిపడదు
ఎప్పుడో కలలో కనిపించే విషాదం కూడా

అని దళితులు బాధలు అనుభవిస్తున్నారు, బాధలు భరిస్తున్నారు కాబట్టి బాధలు పెట్టేవారు పెడుతున్నారు, కవి బాధలు భరించేవాడిని ఎద్దేవా చేసి రెచ్చగొట్టడం ఈ కవితలో కన్పిస్తుంది.

"ప్రయోగం" కవిత ద్వారా దళితుల ప్రతిఘటనలకు మాటలు అనేవి ఉండకూడదూ! అన్ని చేతలే అనీ, ఫిర్యాదులు కాకుండా తామే స్వయంగా న్యాయం చేయలని కవి చెప్పుచున్నాడు ధర్మరాజ్ నిమ్‌సర్కార్.

దళితులను దోపిడీ చేయుచున్న వారికి చాలా ఘాటైనది ఈ కవిత ఉన్నది

'నా నోటి ముద్ద లాక్కుని నలువైపులా విసిరేస్తేగాని
మీ దృష్టిలో 'నా రోగం కుదరదు!'
మీకు ఇలాంటి ప్రయోగం
మళ్ళీ మళ్ళీ చేయకతప్పదు !

దళితులైన మమ్ములను ఏ విధంగా దోపిడీ చేయుచున్నారో, అంతకంతకు మేము మిమ్మల్ని చేయడానికి సిద్ధమవుతున్నామని తన కవిత ద్వారా తెలిపాడు.

శరణ్‌కుమార్ రాసిన 'తెల్లకాగితం' కవిత దళితుల హక్కులను కాగితం ద్వారా అడుక్కోవడం ఒకవేళ ఇవ్వనంటే సంఘర్షణ తప్పదని తీవ్రంగా ధ్వజమెత్తటం ఈ కవితలో కన్పిస్తుంది. మీ బలం - బలగం దళితుల నివాసాల్ని కూల్చినంత సులభంగా, దళితుల ఊపిరితిత్తుల్లోంచి దూసుకొచ్చే గాలి నీ గ్రంథాల్ని బయటపెడ్తాయి, నీ సంప్రదాయాన్ని నిలువునా చీరుస్తాయి అని కవి తెలిపాడు. దళితుల హక్కులు, అకాంక్షలు, నిరాదరణ చేయబడి, తొలగించబడ్డ మా హక్కులు మర్యాదగా ఇవ్వకుంటే న్యాయంలేని మీ న్యాయశాస్త్రం సిటీబస్సులా తగులబడిపోతుంది అని న్యాయం జరగకపోతే మేము ఏ చర్యనైన చేపడ్తామని దళితుల ఐక్యత గొంతును ఈ కవితలో అనవచ్చు.

"కవితా పఠనం" ద్వారా ప్రజలను, తన వారిని, దళితులను ఐక్యం చేయవచ్చని 'దామోదర్ మోరె' నిరూపించాడు. కవి 'కవితా పఠనం నడుమ అందరూ వింటున్నారు కాని ఇద్దరు విస్తుపోయిన దళితులు ముక్కు విరిచారు. అంటే కవిత ద్వారా దళితులకు జరిగిన అన్యాయాలను తెలియజేస్తే తెలియని ఆవేశం విన్నవారిలో కలిగినట్లు కవి సృష్టి. "ఈ కవితా పఠనం ద్వారా మనకు దళితవాదంపై గల అభిప్రాయాన్ని బలపరుస్తుంది.

"ఇది సహజంగా జరగాల్సిందే
ఇన్నాళ్ళు గడ్డకట్టిన మంచు ఇక కరగాల్సిందే"

దళితులకు జరిగిన అన్యాయాలను కవిత ద్వారా తెలియజేయడం వల్ల దళితుల హృదయం చలించి దానికి గల ప్రయత్నాలను చేస్తారని కవి ఉద్దేశం.

కవి "ఆ (అదే నేను
కావాలనుకున్నది
పేలదేమోననుకున్న డైనమైట్
అంటుకుని పేలబోతున్నది" - అని!

దళితులపై జరుగుతున్న దారుణ దమనకాండను, దళితుల హక్కులను, వారి సంక్షేమమును కోరిన కవితను

చదవగానే డైనమైట్ లా దళితులైక్యత పోరాటం రూపంలో పేలబోతుంది అని కవి చెప్పాడు.

ఎల్. జ్యోతిగారు 'గుహలు' అనే కవిత ద్వారా వాళ్ళు అమానుష చర్యలతో గుండెను తొలచి గుహగా మార్చినా దళిత స్త్రీ కాలానికి ఎదురొడ్డి నిల్వాలని, నిరాశా, నిస్పృహలను విడనాడాలని దళితులను నూతనోత్సాహాన్నిచ్చే విధంగా ఉందీ కవిత. దళితుల ఇప్పటివరకు మౌనంగా ఉన్నారు కాని ఇపుడు ఇక

మానవ హక్కుల నిప్పులకు గాలి విసరాలి
కణకణమని వాటిని ప్రజ్వలింప జేయాలి?

దళిత మానవహక్కులను గురించి వివరిస్తూ వాటిని పొందుటకు కావాల్సిన చైతన్యమును అందజేయాలని భావం. కుక్కలకన్నా హీనమైన జీవితాన్ని మాకెందుకిచ్చింది ఈ దేశం? అంటే మేం దళితులుగా పుట్టటమే నేరమా? అంటూనే సహించేది లేదు, కవయిత్రిగా నేనే ఇక్కడ తిరుగుబాటు దారునవుతానని! దళితులకు బాసట నిలిచినది

'మీనా గజభియే కవి 'వెలుగు కరిగి చీకటైన వేళ కవితలో పగలు, రాత్రి కష్టించినా పేదవాన్ని ఎవరు లెక్కచేయరు

'వాళ్ళ కొమ్మల్లేని వృక్షశాఖ
ఏనాటికీ వికసించదు.

కట్టుబానిసైన పేదవాడు ఎంత కష్టించి పనిచేసినా వారు అదోగతిలోనే ఉంటారు. అయినా ఆ పేదవాని ఇంకా

వాళ్ళు నా రక్తపు వ్రేళ్ళను
దెబ్బతీస్తూనే ఉన్నారు.

దళిత పేదవాన్ని దోపిడీ చేస్తూనే ఉన్నార ధనవంతుని వృక్షం బ్రతకాలంటే దళిత బీదవాని రక్త కావాలి. దీని నుండి బయట పడ్డామంటే సంస్కృ సంప్రదాయాలు నన్ను కట్టి పడేస్తున్నాయని ఆవేద చెందుతున్నాడు దళితుడు. వీటన్నింటిని కాదని కనురెప్పే ఎత్తితే మళ్ళీ బానిస యుగానికి చేరుకున్నట్లని కవి దళి బానిసలు అనుభవిస్తున్న బాధలు వివరించారు. అయి దళిత సాహిత్యమును రాయడం గత పది సంవత్సరా నుండి మొదలయింది.

దళితేతరులు దళితల పక్షాన్ని వహించి రాయడం ఉదారవాదం, దళితులే దళితుల సమస్యలపై ప్రతిఘటిస్తూ రాయడం 'ఆత్మాభిమానవాదం', సాంఘికంగా దోపిడికి గురవుతున్నవారు, అన్స్పృశ్యులుగా పరిగణించ బడుతున్నవారు, నీచ వృత్తులుగా చూడబడుతున్న వృత్తులు చేసుకుంటున్నారు, శారీరక శ్రమపై ఆధారపడి బతుకు గడుపుతున్నవారు 'దళితులు' ఇవ్వాళ విద్యావంతులవుతున్నారు, ఉద్యమిస్తున్నారు. సాటి దళిత సోదరులను చైతన్య పరచడానికి సాహిత్యాన్ని ఆయుధంగా ప్రయోగిస్తున్నారు. వీరి సాహిత్యాన్ని దళిత సాహిత్యం అంటున్నాం, వీరి ఉద్యమాన్ని 'దళిత ఉద్యమం'గా ఫరిగణిస్తున్నాం. 19వ శతాబ్దంలో వర్ణవ్యవస్థ, కులవ్యవస్థలపై నిరసన భావం సమాజ పునరుద్ధరణోద్యమంలో భాగమై 'దళితవాద రచనలు ప్రారంభమయ్యాయి. అనేకమంది కవులు గ్రంథాలు, కావ్యాలు అంటరానితనాన్ని తీవ్రంగా విమర్శిస్తూ రచనలు చేసిరి. బాపూజీ ప్రారంభించిన హరిజన ఉద్ధరణ ఉద్యమం కన్నాముందే అస్పృశ్యతను నిరసిస్తూ కవి గురజాడ అప్పారావుగారు 'లవణరాజుకల' అనే ఖండ కావ్యంలో 'మలిన దేహుల మాలలనుచుచు, మలిన చిత్తుల కధిక కులములు నెలనొసంగిన వర్ణధర్మమ ధర్మ ధర్మంబే'' అని రాసి అందులో కులాల తీరు, వర్ణాల వైరుధ్యాలను తీవ్రంగా నిరసించాడు. మంచి, చెడ్డా అనే ఈ రెండు మాత్రమే మనుషుల్లో కల కులాలని చెప్పాడు. మంచియన్నది మాలయైతే మాలనే అగుదును' అని గురజాడ చెప్పెను.

హరిజనుల బాధలకు దర్పణంగా వెలువడ్డ కావ్యాలు గ్రంథాలన్నీ బాపూజీ ప్రారంభించిన హరిజన ఉద్ధరణ, ఉద్యమం తర్వాతనే వెల్వడినవి. అందులో జాషువా గారి 'గబ్బిలము' కాటూరి వేంకటేశ్వరరావుగారి 'గుడిగంటలు) ఎన్నదగినవి. అంటరానితనం అమానుష చర్య అని ఎంతోమంది కవులు ఎన్నో కావ్యాలు రాశారు కాని జాషువా గారి కావ్యంలోని తీవ్రపదజాలం, భావ వ్యక్తీకరణ ఇతర కావ్యాల్లో వ్యక్తం కాలేక పోవడానికి కారణం వారు దళితులు కాకపోవడమే. హరిజనులను ఎంత హీనంగా చూస్తున్నారో 'జాషువా' స్పష్టంగా తెలిపారు.

# కాటువేయకే కాలసర్పమా

- జనస్వామి కోదండ రామశాస్త్రి

కనలేని కాఠిన్యతను కంటిముందుంచి
వినలేని కఠిన వాక్కులను వీనుల్లో దూర్చి
అవిశ్వాసనీయులతో అఘోరావమానముల ముంచి
గుండెల గొందిలో గొడవలగుట్టతో గుబులు పుట్టించి
కర్మశీలతను కాటువేయకే కాలసర్పమా

వలపు విలపనముగ మాఱు విడ్డూరములను విధించి
కారుణ్యమె కొఱతగు కీకారణ్యమున ఏకాకిగ నిల్పి
స్వార్థసాగరతరంగ ఘోషతో దద్దరిల్లించి
మనసును, ములుపోట్లతో ముప్పుతిప్పలు పెట్టి
కుశాగ్రబుద్ధిని కృంగనీయకే కాపట్యమా

భ్రమనే ప్రేమగా చూపి, కల్లను కళ్లకు కాటుకగ దిద్ది
ఎండమావులతో, ఎదకు, దాహోపశమన ఆశను కల్పించి
తరుణోపాయమైన 'తెలుపు'ను చెఱిపి, నఱకప్రాయమైన 'నలుపు' లోదించి
విచక్షణతను వికృతపర్చి, ప్రాణశక్తికి పరువు పోగొట్టి
మానవత్వమును మట్టిలో కలుపకే మమకార పిశాచమా

ఆక్రందించు ఆంతర్యమును చావు బ్రతుకులు సరిదిద్దలేవు
ఏటుపడ్డ ఎడద కోలుకొనుటకల్ల పదును తప్పిన తలపు పాడునే కోరు
వంచన ఒడుపుగ వద్దకు వచ్చి ఒసగును ఓటమి ఏపుగా
సంపద అహంభావజనితం కానపుడె సర్వసౌఖ్యదాయకం
కరుణార్ద్రతను కలకాలమూ కంఠాభరణముగ ధరించు కాలాత్మా

కొల్లూరు - 522 324. గుంటూరు జిల్లా.



- అరిగెల వెంకటసుబ్బయ్య

చిల్లులు పడిన ఓజోన్ పడవ
దిక్సూచి లేని వినువీధుల్లో నడవ
రవిగోళం రక్తకణ జ్వాల విడువ
చటన ఘటనమునకు అటమటించ
కర్పూర హారతిలా రయాన హరించ
ఉత్తర దక్షిణ ధృవాలు గోదించ
హిమ తుషార పర్వత శిఖరాలు ద్రవించ
విశ్వ వినువీధుల్లో లవణాంబుధులుప్పొంగ
ధరణిపై విలయోదధి వికృతవేషాన్నిధరించ
నికట వికట తాండవ కేళి చేయ
కరాళ మృత్యు దంష్ట్రల్ని చాస్తూ
అవనిపై అపార అసువుల్ని త్రెంచు
కంచమ్ము కడ పొంచియున్న పిల్లుల్లా
కటిక క్రౌర్య స్మగ్లర్ల చేతుల్లో
కాననం కుటిల స్వార్థ క్రతుగుండంలో
క్షయమయింది కరకు కురార నాదాల్లో
కానక తొలి పావన హరిత రూపాన్ని
ఆత్మరక్షణ లేక నీరస పూరిత నేత్రాల్తో
ప్రకృతి కాంత హతాత్పరిణామాల్తో
గర్భ శోకాన అశ్రుతర్పణం చేస్తుంది
ఆక్సిజన్ వృక్షాల్తోనే తరిగేవేళ
భూ ఆవరణ కాలుష్యం పెరిగేవేళ
విశ్వవాంఛ క్రుంగు విశ్వాంతరాళంలో
శ్వాసక్రియ నాడుల్ని బుసకొట్టే
కాలుష్యం నిరంతరం మీటుచుండ
ఊపిరి తిత్తుల్తో కార్బన్ వీణ భయనినదం చేయ
జీవన స్రవంతి తంత్రులు బూడిదవుతాయి.
పారిశ్రామిక విసర్జిత వ్యర్థజల
విషపదార్థాల తోరణ మాలలు
గరళ కాలుష్య తరళ పెనుభూతాలు
వికృత గరద దరద వికటాట్ట హాసాలు
నదుల ద్రావణంలో బరి మీటి
మరణం తృణమంటూ లాస్యం చేయు
కడలి పోటుల్లో, కల్లోలాల్లో
ఓడ ప్రమాదాల వల్ల ఉరలిన
చమురు నురుగు సాగరాన
నాగ సర్పంలా ఉత్తుంగ తరంగాల్లో
నాల్కలు సాచి విష ఢమరుక మ్రోయించ
మరణ మృదంగాన్ని వాయించ
జలావరణ వ్యవస్థ కన్నీరు కార్చ
జలచర జీవరాసులు తల్లడిల్ల
కాలుష్య నటరాజ్ఞి నర్తిస్తుంది
ఆమ్ల వర్షం విషపరిప్లావితమై
నరకానికి సరిపడే కాలుష్యపూరితమై
భూగర్భ జల సరోవర పరిష్వంగంలో
నగ్నభరితంగా స్నానం చేస్తుంది
గుప్పించి విడిచిన కాలుష్యాన్ని ఆఘ్రాణించి
అంతరిక్షాన ఎగురుతున్న అస్థిపంజరాలు
ప్రాణరహిత నిర్జీవుల అట్టహాసాలు
కార్బన్ మడుగులో పూచిన కపాలాలు
కాన్సర్ వ్యాధిగ్రస్తుల కరుణగాథలు
చర్మవ్యాధి నిర్భాగ్యుల విషాద గాథలు
శ్వాసకోశ వ్యాధి గ్రస్తుల ఆర్తనాదాలు
గ్రీష్మ తప్తాన్ని భరించలేని దుఃఖతప్తులు
పరిహసిస్తున్నారు నిన్నే... నిన్నే .. నిన్నే
కాలుష్య భీకర మరణ నాదం విన్పిస్తుందా?
చూడవేల? వినవేల? జాప్యమేల?
ప్రాణమంటే ఆవరించిన వాతావరణమే !

తెలుగు పండిట్, ఎస్.వి.కె. హై స్కూల్, గంగవరం (పోస్ట్) వయా ఇంకొల్లు, ప్రకాశం జిల్లా - 523 167.

# రంగులేని జవాబు

హిందీ మూలం : శ్రీ శ్యామ్ విమల్, నోఎడా. అనువాదం . సి. జయశంకర బాబు

పేరు మొహర్ సింహ్
తండ్రి కూలీ
కులం పేదరికం
'గ్రేటర్ కైలాశ్' బంగళాలోని కుక్క
అతడి మురికి షరాయి చేయిని
మోచేత్తో పట్టి లాగింది ఎప్పుడో
దాన్నే నేటి వరకు తొడుగు చున్నాడు
'ఇందిరా క్యాంప్'లో ఉంటున్నాడు....
ఆరవ తరగతి పిల్లవాడు ఈ మొహర్‌సింహ్
సర్కారు బడిలో పరీక్ష వ్రాస్తున్నాడు
డ్రాయింగ్ పేపర్‌పై ఒక దృశ్యం గీస్తున్నాడు
పెన్సిల్‌తో ఒక తలుపు కలిగిన గుడిసె
గుడిసె పై భాగాన చిన్నని
రంగు వెలసిన మువ్వన్నె, ఝండా
రంగులేని ఝుండాకు పైన
క్రిందివరకు వ్యాప్తమైన నల్లటి దట్టని ఆకాశం
పైన ఎడమవైపున కాగితపు తెల్లదనంపై చిత్రించాడు
నల్లటి పెన్సిలుతో సూర్యున్ని !
నేను వాడిని అడిగాను
నీవు ఆకాశాన్ని నల్లగా ఎందుకు చిత్రించావని
ఝుండాలో రంగు ఎందుకు నింపలేదని?
తన భుజంతో ముక్కు నులుముకుంటూ అన్నాడు -
మాష్టారుగారు నా వద్ద ఉన్నదిదొక్కటే రంగు - నలుపు
నేనింకా ఏదో అడుగుచుండగా వాడు
సిగ్గుపడుచూ
నా చేతిలో కాగితం ఉంచి వెళ్ళిపోయాడు
నేనాలోచిస్తున్నాను - సిగ్గుపడుచూ వాడు
మాపై వదలి వెళ్ళిన రంగు
ఏమై వుంటుందోనని?

---

సంపాదకులు, 'యుగ్ మానస్', 18/795/ఎఫ్/8-ఎ, తిలక్‌నగర్, గుంతకల్లు - 515 801.

# స్మృతి సాహిత్యంలో వరలక్ష్మీ త్రిశతికి గల స్థానం

- కె. లక్ష్మీ అన్నపూర్ణ

గృహస్థాశ్రమ ధర్మంలో గృహిణికి గల ప్రాధాన్యం ఎనలేనిది. కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ, భోజ్యేషు మాతా, శయనేషు రంభా, రూపేచ లక్ష్మీ, క్షమయా ధరిత్రీ, షడ్కర్మయుక్తా కులధర్మపత్నీ" అంటూ కొన్ని వందల సంవత్సరాల క్రితం మనువు గృహిణిని ప్రస్తుతించడం జరిగింది. పదకొండవ శతాబ్దిలో నన్నయ భారతంలో శకుంతలచేత "సంతతి గృహమేధి ఫలంబంతయు బడయంగనోపు అనుగుణ భార్యావంతుండగువాడు క్రియావంతుడు, దాంతుడు, పుత్రవంతుడు నగున్" - అని చెప్పించాడు. మనుచరిత్ర కర్త అయిన పెద్దన కూడా ప్రవరుని భార్య గుణ గణాలను వర్ణిస్తూ "వండనలయదు వేవురు వచ్చిరేని అన్నపూర్ణకు నుద్దియౌ నతని గృహిణి" అని ప్రస్తుతించాడు. ఇటువంటి గృహిణిని కోల్పోయిన కవులు వియోగ కావ్యాలను కూడా రచించేవారు. ఆధునిక కవులలో తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు మహాభారతంలోని లుబ్ధకపోతోపాఖ్యానాన్ని ఆధారంగా తీసుకుని ఆత్మార్పణమ"నే పేరుతో రచించారు. దీనిలో పక్షుల జంట యొక్క వియోగ విలాపం వర్ణించబడింది.

భార్యను మహాకవులు తమ రచనల్లో ఆయా సందర్భాల్లో ఉన్నతంగా చిత్రించి చెప్పారు. కానీ భార్యను సాహితీ కౌముదిలో మణిదీపికగా చిరస్మరణీయమైన స్థానాన్ని కల్పించిన ఘనత మాత్రం కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారికే దక్కుతుంది.

తెలుగులో స్మృతికావ్యాలు తక్కువ. స్మృతి అనే మాట ఆంగ్లంలోని ఎలిజీ అనే పదానికి సమానార్థకంగా వాడబడుతోంది. ఈ విషాదమనేది ఎక్కువగా వియోగానికి సంబంధించింది. స్మృతి కావ్యాలు ప్రధానంగా విషాద కావ్యాలు. ఈ స్మృతి అనేది భార్యాస్మృతికానీ, బంధుస్మృతికానీ మరే ఇతర సన్నిహితుల స్మృతి అయినా కావచ్చు. మహాకవులైనవారు దుఃఖాన్ని సైతం కావ్య వస్తువుగా స్వీకరించి రసవత్ప్రబంధాన్ని కానీ, రమణీయమైన కావ్యాన్ని కానీ రచిస్తారు. అదే విధంగా విశ్వనాథవారు కూడా వారి భార్యావియోగం వల్ల ఆయనకు కలిగిన దుఃఖాన్ని అంతా "వరలక్ష్మీ త్రిశతి" అనే పేరుతో ఒక పద్యకావ్యంగా వెలువరించారు.

వరలక్ష్మీ త్రిశతి విశ్వనాథవారి రచనా వైదుష్యానికి మచ్చుతునక అని చెప్పవచ్చు. ఇందులో విశ్వనాథవారి భావుకత్వాన్ని మనం స్పష్టంగా దర్శించవచ్చు. విశ్వనాథవారు భార్యను వెలుగురేఖగా, నిశ్చల మనోభావాభిరామంగా వర్ణించారు. స్త్రీరూపమందిన గేహధర్మంగా భావించారు. నన్నయ తన రచనలో గృహిణిని గృహనీతి విద్యకు ఆకరంగా భావిస్తే, విశ్వనాథవారు మూర్తీభవించిన గేహధర్మమే గృహిణి అన్నారు.ఆయన చేసుకున్న కొద్దిపాటి సుకృతానికే ఆమె వంటి ఇల్లాలు తన ఇంటికి నడిచివచ్చిందనీ, ఇప్పుడామె కైలాసాన్ని చేరిందనీ చెప్పారు. అంటే ఆమెను పార్వతీదేవితో పోల్చి చెప్పడం జరిగింది.

సంతోషం కలిగినపుడు కానీ, దుఃఖం వచ్చినపుడు కానీ, ఏమీ చలించని స్థితప్రజ్ఞురాలన్నారు. అంటే ఆమెను యోగినితో పోల్చడం జరిగింది. ఆమెను తన ఊపిరిగా భావించి ఆమె లేకపోవడం వలన కేవలం శవంగా మిగిలానన్నారు. ఆయన కన్నుల ఎదురుగానే తన వామార్ధ భాగము ఫెళఫెళమని దహించుకొని పోతున్నట్లుగా వున్నదని ఆమె దహనము జరిగే సమయంలో నిశ్చేష్టులైనారు.

కానీ, నగలు కానీ ఏమీ ఆశించక భర్తనే సర్వస్వంగా భావించిన ఆ యోగినిని తలుచుకుని విచారించారు. నిత్యసుమంగళి అయిన ఆమెను పార్వతీదేవి పాలించాలనీ, అతిలోక దివ్య నీలాభివందిత అయిన ఆమెను కళ్యాణగౌరి పాలించాలనీ, అమిత నిర్మలమైన మనస్సునందు ఆనందగౌరి నర్తించాలనీ ఆశించారు. విశ్వనాథవారి అఖిల ప్రశస్తకవనము నకామె పట్టభద్రురాలు. ఆమె లేకుండా తన ఉన్నత చిత్తవృత్తి, బ్రతుకు లేవు. అని దుఃఖించారు.

ఆమె ఒక యోగినీ ప్రకృతి కాబట్టి కలలో కూడా కనిపించట్లేదని స్వప్నవాంఛలో చెప్పుకున్నారు. సతీ వియోగ దుఃఖము గాఢదుర్భరమన్నారు. దుఃఖతత్వము తెలిసీ తెలియనిది అన్నారు. ఈ విధంగా కర్మశతకంలో ఆమె యొక్క గుణగణాలను వారి యొక్క అన్యోన్య దాంపత్యాన్నీ వర్ణించడం జరిగింది. దీనిలోని రచన అంతా దీర్ఘసమాసాలతో నిండి భారంగా నడుస్తుంది.

రెండవ ఖండికయైన నిత్యశతకంలో ఎక్కువగా వైరాగ్యచింతన కనిపిస్తుంది. ఆముష్మిక ప్రస్తావన అధికంగా వున్నది. బ్రహ్మ సత్పురుషుడు, ప్రథమ పాదము వైశ్వానరము, సర్వమాయానుతము దానికి స్థానము. ద్వితీయము తైజసము. స్వప్నవీధి దానికి స్థానము, తృతీయము ప్రజ్ఞానము, సుషుప్తి దానికి స్థానము, చతుర్థము విజ్ఞేయము, ఓంకారము, బ్రహ్మయే సర్వేశ్వరుడు, సర్వజ్ఞుడు, అఖిలప్రభువు, అంతర్యామి. భూతముల కంతటికీ హర్త అని చెప్పడం జరిగింది. ఈశావాస్యములో అఖిల భూతములలో ఆత్మను దర్శించే పురుషునకు, మనుష్యునకు విచికిత్స, శ్వాసము, శోకము లేవనీ సర్వము ఒక్కటేనని అన్నారు. అంటే సమహిత బుద్ధిని గురించి చెప్పడం జరిగింది.

మూడవదైన కర్మశతకంలో ఉత్క్రమము, ప్రాయశ్చిత్తము, దహనము, పిండీకరణము, గోదానము, సంచయనము, నిత్యకర్మ మొదలైన ఖండికలుండగా స్మృతి శతకంలో సనాతని, త్రైగుణ్యము, విధురత, నీడ, సహజమృతి, స్వప్నవాంఛ, దుఃఖ చర్చ మొదలైన ఖండికలు, నిత్యశతకంలో నిత్యానిత్య నిర్ణయము, శ్వేతాశ్వరము, మాండూక్యము, ఈశావాస్యము అనే ఖండికలు వున్నాయి.

ఈ విధంగా వరలక్ష్మీ త్రిశతి అనే కావ్యము విశిష్టమైన రచనగా సాగి స్మృతిశతకంలో చెక్కు చెదరని స్థానాన్ని సంపాదించుకున్నది. ఆనాటి రాజులు భార్య స్మృతికి నేటికీ చెక్కుచెదరని కట్టడాలను నిర్మించి యిస్తే కవులు గొప్ప కావ్యాలను రచించి ఇచ్చారు.

ఈ విధంగా విశ్వనాథవారు వారి భార్యా శిలాక్షరాలైన అక్షర వాఙ్మయంతో కావ్య సౌధాన్ని ప్రేమ నిర్భరులై నిర్మించారు.

ప్లాట్ నెంబరు : 206, సెకండ్ ఫ్లోర్, సాయికృపా అపార్ట్‌మెంట్స్, గాంధీ భవన్, నాంపల్లి, హైదరాబాదు 500 001.

# హిందీ భాషా ప్రస్తుతి

- ఎస్. భాష్యకాచార్యులు

1\. సీ॥ భరత జనులకెల్ల ప్రాభవమ్మును గూర్చి
యేకత్వ మొసగును హిందిభాష
సమతను గల్పించి శాంతిని స్థాపించి
హితవు గోరుచునుండు హిందిభాష
స్వాతంత్ర్య సమర ప్రచార సాధనమయి
వందనములు గొన్న హిందిభాష
నాగరి లిపిగల్గి నవ్యత నలరారి
హిందుదేశము నిండె హిందిభాష

గీ॥ రాష్ట్రభాషగా నిది యలరారుచుండి
దేశభాషలయందున తియ్యదనము
సంతరించుక భారత జనులకెపుడు
ఇంపుసొంపులు గురిపించు హిందిభాష ॥

2\. సీ॥ సంస్కృత సాహిత్య సరసవదోన్నతి
సమరత్వమునుగన్న యగ్రభాష
ఉర్దుభాషా శబ్దయుక్తమై సరసమై
వ్రజపద సమ్మిశ్ర భవ్యభాష
అవధిమైధిలి భాషలాలవాలమ్ముగా
పూర్ణత్వమందిన ముద్దుభాష
బుందేలు, లభ్నోవిపూత పదాంచిత
మధురస స్రోతమౌ మధురభాష

గీ॥ సరస ఖడిబోలి పదముల సంగతమున
చవుల నూరించు మధురతన్ సంతరించి
కొనుచు ప్రత్యేకభాషగ కొలువబడుచు
హింది జగతియందు జ్ఞానసింధువయ్యె ॥

3\. సీ॥ ఏభాష రాకున్న ఇడుములేదందురు
హింధిభాషయురాక ఇతవులేదు
ఏభాష లేకున్న లాభముండునొ! లేదొ!
హింది భాషయెలేక ఇంపులేదు
ఏభాషలేకున్న నేకత చెడబోదు
హిందిభాషలేక హితములేదు
ఏభాష నేర్వక యెటులొ బ్రతకవచ్చు
హిందిభాషయెరాక యేమిలేదు

గీ॥ కాన హిందిభాష కనగ కనకమగును
భారతీయ జనగణమ్ము మనసుతోడ
నేర్వగావలె దీనిని నేమమునను
ననుచు ధృఢమైన కోరిక లలరుచుండు ॥

4\. సీ॥ ప్రతియమైన రచయిత ప్రేమచందు ఘనుడు
నవలలన్ వేలయించె నాణ్యముగను
ఆచార్య శ్రీశుక్ల యగణిత కావ్యాలుగా
వ్యాఖ్యాన రచనలు వ్యాప్తిచేసె
భక్త మీరాభాయి భజన గీతికలెన్నొ
పారమార్థికతను బర్వజేసె
రస్థాను కవియొక్క రచనలు పఠితల
హృదయమ్ములందుండు చెదరిపోక

గీ॥ ఖుస్రొభూషణ కవులు నకుంఠితముగ
దివ్య మలికు మహ్మదు మహాదేవివర్మ
లాదియౌ పండితుల యొక్క యధికదీక్ష
నమృతఫలమయ్యె నీహింది యవనిలోన ॥

5\. సీ॥ సూరదాసు కవియు సూర్యుడై వెలుగొంద
హిందిభాషకు తేజమొసగె యిలను
తులసిదాసు కవియు ఇలనుశశిగవెల్గ
హిందికి మార్దవమ్మొసగెజూడ
ఘన కబీరు కవియు క్రమసూక్తులజెప్ప
హిందిభాషయె నీతికిక్కయయ్యె
దినకరు కావ్యాలు దివ్యమై వెలుగొంద
హిందిభాషకు కీర్తి యినుమడించె

గీ॥ కవులు బిహారీ ప్రసాదులు ఘనులుచూడ
హిందిభాషకు విలువల నిలనునింప
వేలకొలదిగ గ్రంధాలు విస్తరిల్లె
హిందిభాషయు సురభిళ చందనమ్ము ॥

6\. సీ॥ రాజ్యభాష యిదియె రాష్ట్రభాష యిదియె
ఘనమైన భాషగ జనులు బొగడ
గాంధీజి నుడివిన గౌరవభాషగా
కీర్తిగాంచియు హింది స్ఫూర్తినొసగె
మనదేశమున నొక్క మహనీయభాషగ
నెగడుచునున్నది నేర్పుమీర
హిందిభాషయనగ నింపెసలారెడు
రసము చిప్పిలజేయు రమ్యభాష

గీ॥ భాషలన్నిటిలోన బీయూషమొల్కు
భాషగా హింది భారతిభూషయగుచు
హిందుదేశాన విజ్ఞాన సింధువయ్యె
కవిత రత్నాల నిడునట్టి క్రమహింది ॥

## పాఠకులకు అభ్యర్థన

తమ అమూల్యమైన కథలను, కవితలను, సాహిత్య విమర్శలను పంపి నిరంతరాయముగా నెగడునట్లు చేయూతనిచ్చి ప్రోత్సహించవలసినదిగా ఆయా రంగములలో నూతనముగా కాలిడుతున్న యువతీ యువకులను, నిష్ణాతులను, కవితాస్రష్టలను, సాహిత్య విమర్శకులను కథా రచయితలను స్రవంతి అభ్యర్థిస్తోంది.

## స్రవంతి చందాదారులకు మనవి

మీరు చెల్లించిన సాంవత్సరిక చందా రుసుము 1998 మార్చి నెలతో ముగియనున్నది. కావున మమరొక సంవత్సరానికి అనగా 1998 ఏప్రిల్ నెల నుండి 1999 మార్చి నెలవరకు 60 రూపాయలు పంపి, చందాను రెన్యువల్ చేయించు కొనవలసినదిగా కోరుచున్నారము.

***సంపాదకులు***

### సవరణ

1997 నవంబరు సంచిక వార్తావాహినిలో స్వర్గీయ శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారి సంతాప సభకు అధ్యక్షులు, కళాశాల ప్రిన్సిపాల్ "శ్రీ"కు బదులు "స్వర్గీయ" అనే అచ్చుపొరపాటుకు మన్నించగలరు. **- సంపాదకులు**

# గండం గడిచింది

- యం. కరిబసయ్య

పూరీ జగన్నాథుని దర్శనాకాంక్ష ఈ నాటికి తీరుతోందన్న ఉద్వేగంతో మనసు తరంగితమౌతోంది ఆనందరావుకు పెళ్లైన మూడేళ్ళ తరువాత సతీసమేతంగా యాత్ర చేసే అదృష్టం కలిగిదతనికి.

రైలు దిగేటప్పటికి మధ్యాహ్నం పన్నెండు గంటలు. ఉన్నతమైన భవ్యమైన ఆలయ గోపురం చూస్తూనే భక్తి పారవశ్యంతో మనసులోనే జగన్నాథా! జగద్రక్షకా! అనుకుంటూ నేరుగా దేవాలయం వైపుకు దారి తీశాడు.

గైడు సహాయంతో తీరికగా దేవాలయ విశేషాలను తెలుసుకొంటూ దైవదర్శనం చేసుకొని బయట పడేసరికి మధ్యాహ్నం రెండుగంటలయింది. విశాఖపట్టణంలో టిఫిన్ తర్వాత భార్య రుక్మిణి గుక్కెడు మంచినీళ్ళు కూడా త్రాగలేదు. ఒక్క ఎక్స్‌ప్రెసో కాఫీ తప్ప. ఏదైనా దీక్ష అనుకుంటున్నారేమో! కాదు. వాసన సయించక. సముద్ర తీరం కాబట్టి ప్రతి పదార్థమూ చేపవాసనే. చివరికి తాగునీరు కూడా చేపవాసనే.

ఆకలితో నకనక లాడిపోతున్నారిద్దరూ. ఈ ఒరిస్సా రాష్ట్రంలో హోటల్‌సైన్ బోర్డులు కూడా అర్థం కావడం లేదు. విజిటేరియన్ హోటల్ కనుక్కొని కడుపునిండా తృప్తిగా భోంచేయాలని అనుకొన్నారిద్దరూ.

"చూడు బాబూ! మేము శుద్ధ శాకాహారులం. దయచేసి ఏదైనా శాకాహార హోటల్ చూపించగలవా?" గైడ్‌ను అడిగాడు.

"అయ్యా! నేను రోజూ భోజనం చేసే హోటల్ ఈ దగ్గర్లోనే ఉంది. నేనూ శాకాహారినే. బ్రాహ్మణ్ణి. మాంసం తినను. బయల్దేరండి మీకా హోటల్ చూపిస్తాను" అన్నాడు గైడ్.

గైడ్ వెంబడి హోటల్ చేరుకొన్నారు దంపతులు. గైడ్ శెలవు తీసుకొని వెళ్ళిపోయాడు. రెండు భోజనం టిక్కెట్లు కొని టేబుల్ ముందు కూర్చున్నారు. సర్వర్ విస్తర్లు వేశాడు. అన్నంలోకి చేపల పులుసు వడ్డించడం చూసి విస్తుపోయాడు ఆనందరావు. రుక్మిణి కళ్ళనీళ్ళ పర్యంతమయింది. ఇక్కడ బ్రాహ్మణులు చేపలు మాత్రం తింటారట. ఇక చేసేదేముంది! పండ్ల మీద ఆధారపడక తప్పలేదు.

మూడు గంటలకు బస్టాండు చేరుకొన్నారు. కోణార్క సూర్య దేవాలయం చూసి రాత్రికి భువనేశ్వర్ చేరుకోవాలనుకొన్నారు.

చిన్న ప్రైవేటు టాక్సీలో కోణార్క సూర్యదేవాలయం చేరుకొన్నారు. ప్రాచీన చరిత్రపై, శిల్ప సంపదపై అభిమానం గల దంపతులు సహజంగానే కోణార్క సౌందర్యానికి ఆకృష్టులై పోయారు. తెప్పరిల్లేసరికి చినుకులు ప్రారంభమైనాయి. బంగాళాఖాతంలో ఏర్పడ్డ అల్పపీడనం తన ప్రభావం చూపించటం మొదలు పెట్టింది.

గబగబా నడిచి బస్టాండ్ చేరుకున్నారిద్దరూ. పేరుకు అది బస్‌స్టాండే కాని రోడ్డుకు ఇరువైపులా నాలుగైదు టీ బంకులు తప్పితే ఒక్క ఇల్లు కూడా కనబడటం లేదు కనీసం దగ్గర్లో పల్లె ఉన్న జాడ కూడా కనబట్టం లేదు.

కుండపోతగా వర్షం ప్రారంభమైంది. ఈదురుగాలి మొదలయ్యింది. ఒక 'టీ'కి ఆర్డరిచ్చి భువనేశ్వర్ పోవడానికి బస్సు లేమైనా ఉన్నాయోమోనని వాకబు చేశాడు అక్కడున్న వారిని ఇంగ్లీషులో వచ్చీరాని భాషలో వారంతా చెప్పిన సారాంశం ఇది.

''ఇప్పుడిక ఏ బస్సులూ లేవు. సాయంత్రం ఐదు గంటలకే లాస్ట్ బస్ వెళ్ళిపోతుంది. మరుసటి రోజు ఉదయం వరకూ ఏలాటి బస్ సౌకర్యమూ లేదు. రాత్రిపూట ఉండటానికి లాడ్జింగ్ సౌకర్యమూ లేదు. యాత్రికులు సామాన్యంగా ఐదు గంటలలోపు తమ గమ్యం చేరుకుంటుంటారు. లేనట్లయితే ఈ టీ బంకులే గతి. లేదా ఫర్లాంగు దూరంలో ఉన్న బెస్త పల్లెలోని గుడిశల్లో తలదాచుకోవచ్చు. కానీ ఈ వాతావరణంలో అది కూడా

నోటమాట రాలేదు ఆనందరావుకు. ఈ చీకట్లో ఈ వాతావరణంలో, వయసులో ఉన్న భార్యతో, అపరిచిత ప్రదేశంలో రాత్రంతా ఎలాగడిపేది! దిక్కు తోచక సతమతమై పోతున్నాడు ఆనందరావు.

''మే ఐ హెల్ప్ యూ! ఐ యాం భండారీ. ఎక్స్‌టెన్షన్ ఆఫీసర్, రెవెన్యూ డిపార్ట్‌మెంట్'' చేతులు చాస్తూ ముందుకు వచ్చిన వ్యక్తివైపు పరిశీలనగా చూశాడు ఆనందరావు. వైట్ షర్ట్ పై బ్లాక్ పాంట్ టక్ చేసి ట్రిమ్‌గా ఉన్నాడా వ్యక్తి. రిమ్‌లెస్ కళ్ళద్దాలు పెట్టుకున్నాడు. వయస్సు దాదాపు ముప్పై ఐదు, నలభై మధ్య ఉండవచ్చు సంస్కారిలా ఉన్నాడు. స్వచ్ఛమైన ఇంగ్లీష్ మాట్లాడుతున్నాడు. వెడల్పు ముఖం దట్టమైన కనుబొమలు, ఒక ఉద్యోగి మాదిరిగానే ఉన్నాడు.

''గ్లాడ్ టు మీట్‌యూ! ఐయాం ఆనందరావ్ ఫ్రం కర్నూలు-ఆంధ్రా. ఐ వాంటు టు రీచ్ భువనేశ్వర్. షి ఈజ్ మై వైఫ్. ఐ లెర్న్‌ట్ దట్ దేరీజ్ నో కన్వేయన్స్ టిల్ మార్నింగ్. టిప్ మి ఇఫ్ యూ ప్లీజ్ సర్!'' షేక్‌హాండిస్తూ అన్నాడు ఆనందరావు.

భండారీ మంచివాడిలాగున్నాడు.రెవిన్యూ పనిమీద జీప్‌లో క్యాంప్‌కు వచ్చాడట. తానూ భువనేశ్వర్ వెళుతున్నాడు కాబట్టి మా దంపతులను డ్రాప్ చేస్తానని ఒప్పుకొన్నాడాయన. అంతలోనే జీప్ కూడా వచ్చి టీ బంకు ముందర నిలబడింది. జీపులో డ్రైవరూ మరి ఇద్దరు మనుషులూ ఉన్నారు. ''మైస్టాఫ్'' అన్నాడు ఆనందరావుతో. మళ్ళీ వాళ్ళవైపు తిరగి ''టేక్ టీ ఇమ్మీడియట్లీ వుయ్ షల్ స్టార్ట్'' అన్నాడు భండారీ. తరువాత నలుగురూ ఆనందరావుకు అర్థంకాని ఓఢ్ర భాషలో మాట్లాడుకోసాగారు.

మిగతా ముగ్గుర్నీ పరశీలనగా చూశాడు ఆనందరావు. డ్రైవర్ బలిష్ఠంగా బుర్ర మీసాలతో, బట్టతలతో, సినిమాలో విలన్ లాగా ఉన్నాడు. మిగతా ఇద్దరి ముఖంలోనూ దౌష్ట్యం, క్రూరత్వం కనబడుతోందే కానీ, మానవత్వం, సంస్కారం అనేది కించిత్తూ కన్పించటం లేదు.

ఆనందరావులో అలజడి మొదలయ్యింది. ఈ వర్షంలో, భార్యతో తెలియని ప్రదేశంలో రాత్రిపూట, నమ్మి ఎలా ప్రయాణం చేసేది? క్షణక్షణానికి అనుమానం పెరిగి పోతోంది. తానేమో ఒక్కడు. వాళ్ళు నలుగురు. దారి మళ్ళిస్తే తానెలా తెలుసుకోగలడు? అఘాయిత్యానికి పాల్పడితే తాను ఒకడు ఎలా ఎదుర్కోవడం? భార్య మెడలో, నగలూ గొలుసూ, ఉంగరాలూ... సొమ్ము పోతే ఫరవాలేదు. మానప్రాణాలకు నష్టం ఏర్పడితేనో! కంపించి పోయాడు ఆనందరావు ఈ ఆలోచన రాగానే! ప్రయాణం మానుకొందామా? మేము రామని ఖచ్చితంగా చెప్పేద్దామా! అయినా రాత్రి ఇక్కడ ఎలా గడపడం?

వాళ్ళు మాట్లాడుకుంటూ టీ త్రాగుతున్నారు. వాళ్ళ చూపులు క్షణక్షణానికీ భయంకరంగా కనిపిస్తున్నాయి. ఆనందరావుకు. వర్షం బోరున కురుస్తూనే ఉంది. గాలి హోరున వీస్తూనే ఉంది.

''బస్సులేవీ లేవంట! ఏం చేసేదబ్బా!'' తెలుగు భాష వినపడగానే చటుక్కున తలెత్తి చూశాడు ఆనందరావు. తాను నిల్చున్న చోటుకు ఎదురుగా రోడ్డుకు అవలివైపు టీ బంకులో కొందరు తెలుగులో మాట్లాడుకుంటున్నారు. ముగ్గురు మగా, ఇద్దరు ఆడవారు, ఇద్దరు పిల్లలు.

ఔను. వీరిని దేవాలయం వద్ద తాను చూశాడు. తమతో పాటే వీరు కూడా కోణార్క దేవాలయం చుట్టూ తిరిగి చూశారు. వాన వచ్చేసరికి తానూ రుక్మిణీ గబగబా వచ్చేసారు. అప్పటికి వీరు ఇంకా దేవాలయం దగ్గరే ఉన్నారు. తమకు ఎదురైన సమస్యే వీరికి కూడా ఎదురైందేమో!!

చివాలున రోడ్డు దాటి ఆవలి టీ కొట్టు చేరుకొన్నాడు ఆనందరావు.

"మీదేవూరు" అడిగాడు.

''మాది కడప సారూ'' నడివయస్కుడు జవాబిచ్చాడు.

"ఎక్కడికెళ్ళాలి?''

"యాడికెళ్ళాలన్నా బస్సులు లేవంట గద సామీ"

"మేము భువనేశ్వర్‌కు జీపులో వెళ్తున్నాం. మీరూ వస్తారా?''

"వస్తాం సారూ! దేవుడిలా గొచ్చారు. మేం అట్నుంచి రైల్లో వూరెళ్తాం".

"సరే! అయితే ఒకపని చేయండి మేమూ ఇక్కడికి కొత్త. మాది కర్నూలు నేనూ మా ఆవిడా యాత్రలకొచ్చాం. ఇక్కడ ఇరుక్కుపోయాం. ఎవరో ఒకతను జీపులో భువనేశ్వర్ తీసుకుని వెళ్తానన్నాడు. వారు నలుగురున్నారు. పరిచయం లేని వ్యక్తుల వెంట రాత్రి పూట ఎలా వెళ్ళేది! అని సందేహిస్తున్నాను. ఎలాగూ జీపు భువనేశ్వర్ వెళ్తోంది గనక మీరు మాత్రం బరువౌతారా? కావాలంటే వాళ్ళకు ఛార్జీలిద్దాం. మీరు ఐదు మంది, మేమిద్దరం. మొత్తం ఏడుమందిమి ఉంటాం కాబట్టి ధైర్యంగా జీపు ఎక్కొచ్చు. వాళ్ళేం చేసుకోలేరు. ఏమంటారు?'' అన్నాడు ఆనందరావు.

"పదండి సారూ. ఇంతమందిమి ఉండాము. యానా కొడుకేం చేస్తాడు. చూద్దాం!'' అన్నారు ముగ్గురూ.

"సరే! మీరంతా ఇక్కడే ఉండుండి. జీపులో ఎక్కేటప్పుడు నేను మిమ్మల్ని పిలుస్తా. వెంటనే మీరంతా జీపెక్కి కూర్చోండి'' అని వాళ్ళకు చెప్పి ఆనందరావు రోడ్డు దాటి ఇవతలికి వచ్చేశాడు.

అప్పటికి వాళ్ళు టీ త్రాగటం పూర్తయింది.

"లెట్స్‌గో'' అన్నాడు భండారీ.

''వై నాట్'' అంటూ సూట్‌కేస్ పట్టుకొని అనుసరించారు ఆనందరావు దంపతులు.

జీపులో కాలుపెడుతూ "ఓ అన్నా రండి!'' అని పిలిచాడు ఆనందరావు వాళ్లను. వెంటనే ఆ ఐదుమందీ పిల్లలతో సహా బిలబిల మంటూ వచ్చి జీపెక్కి కూర్చున్నారు.

"వాటీజ్ దిస్? హూ ఆర్ యు? గెట్ డౌన్! అరిచాడు భండారీ.

"నో సర్, ప్లీజ్. దే ఆర్ మై రిలేటివ్స్. దే విల్ ఆల్ సో కమ్ వితజ్".

ఇక డ్రామా మొదలైంది. చుట్టూ టీ బంకుల్లో నిలుచున్న వాళ్ళు కూడా ఈ గొడవలో పాలు పంచుకొన్నారు. వచ్చీరానీ భాషతో హిందీ, ఇంగ్లీషు రెండూ ఉపయోగించి చుట్టూ జనానికి విషయం అర్థం అయ్యేలాగున చెప్పగలిగాడు ఆనందరావు.

"ఎంత మందైతేనేం? ఖాళీగా ఉందిగా! అందర్నీ తీసుకుపో ఇద్దర్ని తీసుకొని పోయి మిగిలిన వాళ్ళను వదిలేస్తే ఎట్లా?'' అని జనంతో అనిపించగలిగాడు.

చివరికి జీప్ కదిలింది. మహావేగంగానే నడుపుతున్నాడు బుర్రమీసాల డ్రైవర్. ఆనందరావు చిరునవ్వులు చిందిస్తున్నాడు. భండారీ ముఖం జేవురించుకొని ఉంది.

మౌనంగా ప్రయాణం సాగుతోంది. చీకటిని చీల్చుకుంటూ ప్రకాశవంతమైన హెడ్ లైట్స్ కాంతిలో తారురోడ్డు నల్లగా పరుచుకొని కనిపిస్తోంది. వైపర్లు నిర్విరామంగా పనిచేస్తున్నాయి. వర్షం అధికమైంది. గాలి

నుంయ్-నుంయ్‌మంటోంది. టార్పాలిన్ గాలికి కొట్టుకోకుండా చివర్న కూర్చున్న వాళ్ళు గట్టిగా పట్టుకొని కూర్చున్నారు.

అర్ధగంట తర్వాత భండారీ బ్రహ్మమీసాల డ్రైవర్‌తో ఏదో అని మౌనభంగం చేశాడు. అంతే వాళ్ళు నలుగురూ ఏదేదో గట్టిగా మాట్లాడుకుంటూనే ఉన్నారు. ఇదేమీ పట్టనట్టు వీళ్ళు మాత్రం మౌనంగా కూర్చుండిపోయారు. కొద్దిపాటి సంభాషణ తప్ప వారిపేర్లు మల్లన్న, కొండయ్య మరియొకతని పేరు పుల్లారెడ్డి అని తెలిసింది. అంతే అంతకు మించి మాటల్లేవు.

దూరంగా లైట్లు కనిపించాయి. జీప్ మెయిన్ రోడ్డు చేరుకుంది. అదేదో చౌరస్తా లాగుంది. చూడగానే చిన్న టౌన్ ఉండొచ్చు అనిపించింది. రోడ్డు కిరువైపులా అంగళ్ళూ, హోటళ్ళూ ఉన్నాయి. జీపు ఊరిమధ్య రోడ్డు ప్రక్కన ఆగేసరికి సమయం రాత్రి ఎనిమిదిన్నరయింది.

"యూ ప్లీజ్ గెట్ డౌన్ హియర్. దేరీజె బస్ ఫర్ యు. వుయ్ ఆర్ ప్రొసీడింగ్ టు మాథోపుర్" అన్నాడు బండారీ ఆనందరావుతో.

"నో! యూ హ్యావ్ ప్రామిస్డ్ టు గివ్ లిఫ్ట్ అప్ టు భువనేశ్వర్. వుయ్ విల్ గెట్ డౌన్ దేర్ ఓన్లీ" అన్నాడు ఆనందరావు.

"ఏమంటున్నాడు సార్ దొంగనాకొడుకు?' అడిగాడు మల్లన్న.

"ఇక్కడి నుండి భువనేశ్వర్‌కు బస్ ఉందట. బస్సులో వెళ్ళమంటున్నాడు. మేం దిగాలట. ఎవరూ దిగకండి" అన్నాడు ఆనందరావు.

అంతే ఆడవాళ్ళూ మగవాళ్ళూ గోలగోలగా తిట్లకు లంకించుకొన్నారు. వారేం మాట్లాడుతున్నారో వీరికి, వీరేం మాట్లాడుతున్నారో వారికి అర్థం కాకపోయినా చేతులూపుకుంటూ మాట్లాడేస్తున్నారు. జీపంతా గోలగోలగా ఉంది. నిరామయంగా సీట్లో వెనక్కి వాలి కళ్ళు మూసుకొన్నాడు ఆనందరావు. ఎవరూ దిగలేదు. పది నిమిషాల పాటు ఈ పరిస్థితి కొనసాగింది.

మెయిన్ రోడ్డులో ఏదో బస్సు వచ్చి ఆగింది.

"సీ మాన్! దటీజ్ ద బస్ హు హావ్ టు క్యాచ్" ఆనందరావునుద్దేశించి అన్నాడు భండారీ.

"మల్లన్నా! మీరు జీపులోనే ఉండండి. దిగకండి. ఇప్పుడొచ్చిన బస్సు భువనేశ్వర్ వెళుతుందంటున్నాడు. నేను కనుక్కొని వస్తాను". అంటూ దిగి బస్ దగ్గరికి వెళ్ళాడు ఆనందరావు. అది భువనేశ్వర్ వెళ్ళే బస్సేనని కన్ఫర్మ్ చేసుకొన్న తరువాత జీప్ దగ్గరకొచ్చి అందర్నీ దిగమన్నాడు. బిలబిలమంటూ అందరూ దిగారు.

"థాంక్యూ మిస్టర్ భండారీ! హియర్ ఈజ్ యువర్ ఫెయిర్" అంటూ వందనోటు అందించబోయాడు ఆనందరావు.

"గెట్‌లాస్ట్ యూ రాస్కెల్!" భండారీ అంటూండగానే రివ్వున దూసుకుపోయింది జీపు. వందనోటు రెపరెప లాడుతూ ఆనందరావు చేతిలోనే ఉండిపోయింది.

అందరూ బస్ ఎక్కి ఊపిరి పీల్చుకొన్నారు.

తిడితే తిట్టాడుగానీ గండం గడిచింది అనుకుంటు ఆనందరావు ఆనందంగా సీట్లో వాలాడు.

పెద్ద పప్పూరు (పోస్ట్) 515 445, తాడిపత్రి తాలూకా, అనంతపురం జిల్లా.

# జటాయువు ధర్మబోధ

శ్రీమద్రామాయణ కల్పవృక్షములోని అరణ్యకాండము నందలి అయిదు ఖండాలలోని నాలుగవ ఖండము అయిన జటాయుః ఖండమును తీసుకొని, అందులో జటాయువు రావణుడు సీతాపహరణము చేస్తున్న సందర్భములో కావించిన ధర్మబోధ ఈ పరిశీలనా వ్యాసము. ఇందులో కథ తక్కువ. బోధనలు, వర్ణనలు, సన్నివేశాలు ఎక్కువగా ఉన్నాయి. ఈ జటాయుః ఖండమును "జటాయువు ధర్మబోధగా వ్యాఖ్యానముతో అందించిన వారు డా॥ ఆదవాని హనుమంతప్ప.

శ్రీమద్రామాయణ కల్పవృక్షమును గురించి, రామాయణ కల్పవృక్షమును తనే విధంగా చెప్పాడో, ఆ విషయమును విశ్వనాథవారు - "రామాయణ కల్పవృక్షమును వాల్మీకిని అనుసరించినానని, కొన్నిచోట్ల అతిక్ర మించి వ్రాసినానని, కొన్నింటిని లోపింపచేసినానని, నా రామాయణము నాది ఏ పురాణమైనను, ఏ ఇతిహాస మైనను, ఏ కావ్యమైనను లోకము యొక్క కథను వదిలిపెట్టియుండదు! పేరునకు రామాయణము. పాత్రలననుసరించి, కథననుసరించి కవి యొక విశిష్ట బుద్ధి కలవాడు. తన కల్పనలను తాను చేసుకుంటాడని" - కల్పవృక్ష రహస్యములు అను పుస్తకములో తొలి మాటలనందు చెప్పారు. ఈ రహస్యములు బాలాకాండ (తో)నే ఆగిపోయినవి.

జటాయువు ధర్మబోధ
డా॥ ఆదవాని హనుమంతప్ప
ప్రతులకు
శ్రీమతి ఎ. వెంకటేశ్వర ప్రసూన,
5-2పి, న్యూ ఇంజనీరింగ్ కాలేజి,
అనంతపురం - 515 002;
పుటలు : 14+56+2;
వెల రూ. 35/-

ఈ మధ్యకాలములో శ్రీమాన్ మల్లంపల్లి శరభయ్యగారు రామాయణ కల్పవృక్ష సుందరకాండకు వ్యాఖ్యానమును వ్రాసారు. ఆచార్య కోవెల సంపత్కుమారా చార్యగారు యుద్ధ కాండశిల్పావతారికని; శ్రీ వడలిమందేశ్వరరావు కిష్కింధకాండ; డా॥ విష్ణుభొట్ల విశ్వనాథశాస్త్రి - అయోధ్యాకాండము; శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు సుందరకాండములోని బహువిధ సౌందర్యము; శ్రీ ఎం.వి.యస్. శర్మ - అనసూయ ఖండము; శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తి - అరణ్యకాండములను గురించి చెప్పారు. ఇప్పుడు అరణ్యకాండములోని జటాయుః ఖండము గురించి డా॥ ఆదవాని హనుమంతప్పగారు విశ్వనాథవారి కవితా శిల్పాన్ని పరామర్శించి, జటాయువు పాత్ర ఔన్నత్యమును పాఠకులకు అందించారు.

కథానుశీలనముగా పరిశీలిస్తే విశ్వనాథవారు, వావిలికొలను సుబ్బారావుగారు, రాజాజీగారు దాదాపు ఒకే ప్రణాళికను అనుసరించినట్లుగా కానవస్తుంది. అయితే ఈ మూడూ వేటికవే ప్రత్యేకతను నిలుపుకున్న గ్రంథాలు. దేని ప్రతిభ దానిదే.

విశ్వనాథవారు అరణ్య కాండమును "కవితా రూప తపస్సు" చేసి వెలువరించానని చెప్పుకున్నాడు. అందువలన దానికొక ప్రత్యేకత ఉన్నది.

'కవితా రూప తపస్సు చేసెదను, శ్రీ కంఠా! మనస్సంయమా
ది విధానంబుల జేతకాని తనమైతిన్, మూర్తసంవిత్కళా
యువతీ భోగ హరింపజేయుటకు మారోడ్డుంజుమీ యింద్రియా
ది వికారంబుల భావనా విమల వాక్తర్థంబులలే పొరగన్'

ఈ కవితా రూప తపస్సు రామాయణ కల్పవృక్షము ఆద్యంతము కానవస్తుంది. అంతే కాదు ఆయన ప్రతి కావ్యము ఒక ప్రత్యేకతతోను, నిష్ఠతోను అందించారు.

"నా కవితన్ విశాల జఘనా! ఒక యౌచితిలేదు భాషలే
దాకృతిలేదయూరక రసాత్మతనే ప్రవియించిపోదునీ
వాకృతి యందమాచిన రసాత్మవు నీకును నాకభిన్న తా
శ్రీకత కల్గెనా పులకరించెను బొమ్మురస ప్రపంచములో"
"-శృంగారవీథి"

అని విశ్వనాథ వారు రస ప్రపంచములను మన ముందుంచుతారు. జటాయుః ఖండాంత పద్యములో "సుందర పవిత్ర భావభాసురము, నూత్న శిల్పము" తన రచనలో ఉందని చెప్పారు. ఈ ఖండాంత పద్యమును తీసుకొని హనుమంతప్పగారు ఈ అనుశీలనను ప్రారంభించారు. దానివలన విశ్వనాథ వారు అనుసరించిన సుందర భావాన్ని పవిత్రంగానూ, అందంగాను అందించి పాఠకులను కావ్యానుశీలనలోకి తీసుకువెళుతున్నాడు.

మన తెలుగు సాహిత్యములో పశుపక్ష్యాదులకు కూడా ఒక విశిష్టత ఉన్నది. గరుత్మంతుడు, జటాయువు, వాసుకి, తక్షకుడు, పింగళకుడు, సంజీవకుడు, కరటకదమనకులు, వాలి సుగ్రీవులు, హనుమంతుడు, జాంబవంతుడు, ఉడుత.. ఇలా ఇలా ఏ పాత్రకు ఆ పాత్రే విశిష్టముగా సాగినవి. ఇందులో జటాయువు పాత్రను విశ్వనాథవారు ఒక విలక్షణముగా ఆవిష్కరించారు.

డా॥ హనుమంతప్పగారు ఈ వాఖ్యానమును రెండు పార్శ్వములుగా అందించారు. మొదటిది జటాయుః ఖండములోని శిల్పమును, సౌందర్యమును, రెండవది జటాయువు పాత్ర ఔన్నత్యమును విపులీకరంచడం.

విశ్వనాథవారు రావణుడిని 231 పద్యములో "రక్షఃకులేశ్వరుడు" అని అంటారు. దీని గురించి చెపుతూ హనుమంతప్పగారు ఇంగ్లీషు సినిమాలలోని టెంటకిల్స్ (విచిత్ర జంతువు) ను దృష్టిలో. పెట్టుకొని చెప్పారని అంటున్నారు. రక్షఃకుళీరము - కుళీరము అంటే ఎండ్రకాయ. పెద్ద ఎండ్రకాయను తీసుకుంటే ఎండ్రకాయకు ఇరువైపులా అనేకమైన కాళ్ళలాంటివి ఉంటాయి. అది దేనినైనా పట్టుకుంటే ఇరువైపుల కాళ్ళతో పట్టుకొని ముందున్న కోరలతో కొరుకుతుంది. రావణాసురుడి ఇరువది చేతులను దృష్టిలో వుంచుకొని ఇలా వర్ణించారేమో! కులేశ్వరః అంటే జాలాధిపతి (చూడుడు సంస్కృతాంధ్ర నిఘంటువు - వెత్రా వెంకటశేషయ్య) ఇక ఈ విషయం వదిలేస్తే - విశ్వనాథవారు ఈ ఖండములో వాడిని అనేకమైన వృత్తములను పేర్కొని వారి పద్య శక్తిని విపులీకరించారు. ఆ పద్యం ఏ సందర్భములో చెప్పినారో సందర్భోచితముగా చూపెట్టినారు.

జటాయువు దశరథునికి ఎలాంటి మిత్రుడో, రావణాసురునికి సమ ఉజ్జీ ఎలాగో విశదీకరించారు. రావణాసురుడు ఎంతటి శివభక్తుడో కూడా చెప్పారు. "పరిపూర్ణమైనటు వంటి శివభక్తుడు. పార్వతీనాథ భక్తి కళానమ్రమనస్కుడౌదువు..." అంటారు. ఈ ఖండములో రావణాసురునికి రెండుమార్లు జటాయువు నీతిని బోధిస్తాడు. "సీతను ఎత్తుకుపోవడం మంచిది కాదు. కాలపాశంనీ మెడకు తగిలి ఈడ్చుకొని పోవడానికి సిద్ధంగా ఉన్న సంగతి నీవు గుర్తించటం లేదు. దుర్మార్గాన్ని చేపట్టకు. భరింపరాని భారాన్ని మోసుకొని పోవాలని చూడకు. నేను ముసలివాడను. నీవు యువకుడవు. నీకు విల్లుంది. రథం మీద ఉన్నాను కదా తప్పించుకుందామని అనుకుంటున్నావేమో! ముసలివాడనని సంతోషపడేవు. ఒక తన్ను తన్నినానంటే పైకెగసి కిందపడిన చోటు కూడా తెలియకుండా తంతాను" అంటూనే రావణాసురుడిని ఎదుర్కొన్నాడు. తీవ్రంగా యుద్ధము చేసాడు. వాని తల కాయలను, చేతులను తన ముక్కుతో, గోళ్ళతో చిట్లించాడు. కానివాడు వరప్రసాదుడు కాబట్టి జటాయువు వలన చంపడం సాధ్యం కాదని చెబుతాడు. ఇందులో లోకోత్తర సూక్తులు, నానుడులు మనకు అందిస్తారు. జటాయుష పరాక్రమం మనకు తెలుస్తుంది. విశ్వనాథ పద్య శిల్పిగా: ఆయన ఎన్నో అలంకారాలను, సౌందర్యాన్ని ఈ పద్యాలల పొందుపరచడం వలన ఎవరికి వారు చదువుకోవడం అనుభవించడము, ఆస్వాదించడము బాగుంటుంది కొంతవరకు ఆ పద్యాలలోని సొబగులను, అందాలను ఏ విధమైన అననశీలనలవలన తెలుసుకోవడమునక అవకాశం ఉంటుంది. ఎలాంటి భేషజాలకు పోకుండా వ్యాఖ్యానం చేయడం వలన దానికి పుష్టి చేకూర్చింది.

ఆదవాని హనుమంతప్ప చేసిన ఈ ప్రయత్న విశ్వనాథ రచనలంటే అమ్మో! అనుకునే వారికిది ఒలిచి కలకండలా ఉపయోగపడుతుంది.

---

డా॥ టి. శ్రీరంగస్వామి, ఎం.ఏ. పి.హెచ్‌డి.
ఇం.నెం. 5-11-481, విద్యారణ్యపురి, వరంగల్లు 506 00

## వెత్సాకు అభినందనమాల

అక్టోబర్ 29 : స్థానిక కో ఆపరేటివ్ అర్బన్ బ్యాంక్, ఏలూరు మాజీ కార్యదర్శి ప్రస్తుత ఛైర్మన్ శ్రీ వెత్సా పాండురంగారావు 60వ జన్మదినోత్సవం సందర్భంగా సోమవారం సాయంత్రం బ్యాంక్ మీటింగ్ హాలులో అర్బన్ బ్యాంక్ స్టాఫ్, జిల్లా హిందీ ప్రచారక మండలి సంయుక్త ఆధ్వర్యంలో శతావధాని శ్రీ పద్మాకర్ అధ్యక్షతన జరిగింది. ఆంధ్రప్రదేశ్ హిందీ ప్రచారక మండలి అధ్యక్షులు శ్రీ కాజా వెంకటేశ్వరరావు, రిటైర్డ్ ఎస్.పి. శ్రీ పి. దామోదరరావు, సహకార బ్రహ్మ వేగుంట కనకరామబ్రహ్మం, బ్యాంక్ ఉపాధ్యక్షులు శ్రీ పైండా రామకృష్ణా రావు, శ్రీ ఎ.పి. నరసింహ రాజు, అంబికా సంస్థల ఛైర్మన్ శ్రీ అంబికా కృష్ణ, బ్యాంక్ మాజీ అధ్యక్షురాలు డా. కాంచనమాల, మాజీ డైరెక్టర్ జవ్వాజి పాండురంగారావు ముఖ్య అతిధులుగా పాల్గొన్నారు. శ్రీ అంబికా కృష్ణ, ఆంధ్రప్రదేశ్ హిందీ ప్రచారక మండలి అధ్యక్షులు శ్రీ కాజా వెంకటేశ్వరరావు మాట్లాడుతూ శ్రీ వెత్సా శేష జీవితం సుఖ సంతోషాలతో గడవాలని ఆకాంక్షించారు. ఈ అభినందన సభకు హిందీ పండిట్స్, బ్యాంక్ ఖాతాదారులు, కస్టమర్స్, మెంబర్స్, కళాకారులు, శ్రేయోభిలాషులు విచ్చేసి శ్రీ వెత్సాకు శుభాకాంక్షలు అందజేశారు. చీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ శ్రీ వి.వి. బసవేశ్వరరావు వందన సమర్పణ చేశారు.

శ్రీ వెత్సా దంపతులకు శ్రీయుతులు ముక్తేశ్వరరావు, ఆర్గనైజర్; కాజా వెంకటేశ్వరరావుగారు, ఆం.ప్ర. ప్రచార మండలి అధ్యక్షులు; సీతారామదాస్, కృష్ణాజిల్లా; వెంకటాచార్యులు, సెక్రటరీ, ప.గో. జిల్లా ప్రచారక మండలి నామస్మరణికను బహుకరించారు.

## ప్రమాణ పత్రముల వితరణోత్సవము - గన్నవరం

ది. 23-11-97 ఆదివారము మధ్యాహ్నము గం॥ 2.00 లకు గన్నవరం జిల్లా పరిషత్ బాలుర ఉన్నత పాఠశాల యందు ప్రముఖ హిందీ ప్రచారకురాలు శ్రీమతి నర్రా బేబీ సరోజిని గారు తమ విద్యాలయ విద్యార్థినీ, విద్యార్థులకు ప్రమాణ పత్రముల వితరణ సమావేశమును ఏర్పాటు చేసిరి. ఈ సమావేశమునకు కృష్ణాజిల్లా హిందీ ప్రచారకమండలి అధ్యక్షులు శ్రీ యన్. ముక్తేశ్వరరావు గారు అధ్యక్షత వహించిరి. ప్రాంతీయ సభ కార్యదర్శి శ్రీ ఓ. సురుళీగారు సభను ప్రారంభించిరి. అతిథులుగా శ్రీ కాజ వెంకటేశ్వరరావుగారు, శ్రీ అప్పారాయవర్మగారు, శ్రీ డా॥ కె. హనుమంతరావు గారు, శ్రీ డా॥ ప్రేమ నారాయణ సింహాగారు, శ్రీ సి.హెచ్. శేషగిరిరావుగారు, శ్రీ బి.జె. సింగ్ గారు, శ్రీ కె. పూర్ణచంద్రరావు గారు వేదిక నలంకరించిరి. వీరు తమ తమ సందేశములలో హిందీ ఆవశ్యకతను గురించి విద్యార్థినీ, విద్యార్థులకు తెలియజేసిరి. గన్నవరం చుట్టు ప్రక్కల ప్రముఖ హిందీ ప్రచారకులు ఈ సమావేశంలో పాల్గొనిరి. సుమారు 200 మంది విద్యార్థినీ, విద్యార్థులు ప్రమాణ పత్రములను అందుకొనిరి. ఈ సమావేశములో ప్రాంతీయ సభా కార్యదర్శి శ్రీ ఓ. సురుళీగారికి కృష్ణా జిల్లా హిందీ ప్రచారక మండలి తరపున గౌరవనీయులు శ్రీ కాజ వెంకటేశ్వరరావు గారు, విద్యాలయము తరపున జె. వెంకటేశ్వరరావుగారు సన్మానము చేసిరి. విద్యాలయ బాల బాలికలు తమ గురువుగారైన శ్రీమతి బేబి సరోజినిగారిని, మరియు అతిథులను సన్మానించిరి. సాయంత్రం గం॥ 4.00 కు జాతీయ గీతంతో సభ ముగిసినది.

# పట్టణ హిందీ ప్రేమీ మండలి, గుంటూరు
# ప్రమాణ పత్ర వితరణోత్సవము

ది. 25-10-97 శనివారము సాయంత్రము 5 గం॥లకు శ్రీ మాజేటి గురవయ్య హైస్కూలులో, హిందీ ప్రేమీ మండలి వారిచే 1997 సం॥ ఫిబ్రవరిలో జరిగిన ప్రారంభిక పరీక్షలలో ఉత్తీర్ణులయిన విద్యార్థులకు బహుమతి ప్రదానము మరియు ప్రమాణ పత్ర వితరణ సభ జరిగినది.

పట్టణ హిందీ ప్రేమీ మండలి అధ్యక్షులు శ్రీ చక్కా రామకృష్ణారావుగారు సభాధ్యక్షత స్థానము నలంకరించిరి. వారు తమ అధ్యక్ష ఉపన్యాసములో - హిందీ నేర్చుకొనవలసిన ఆవశ్యకతను వెల్లడించిరి. మండలి కార్యదర్శి శ్రీ చింతలపూడి కుసుమహరనాథ శర్మగారు తమ నివేదికను సమర్పిస్తూ మండలి కార్యకలాపములను గూర్చి వివరించిరి.

ద.భా. హిందీ ప్రచార సభ, ఆంధ్ర కార్యదర్శి శ్రీ ఓ. సురుళీ గారు ముఖ్య అతిథిగా సమావేశమునకు విచ్చేసిరి. వీరు తమ ప్రసంగములో - "హిందీ ప్రచార అభివృద్ధి కొరకు, హిందీ ప్రచారకులు ఇంకా మిక్కిలి కృషిచేసి, మహాత్మాగాంధీ గారి ఆశయములను నెరవేర్చవలెనని" హిందీ ప్రచారకులను కోరుతూ, ఆంధ్రసభవారి కార్యకలాపములను మరియు హీరక జయంతి మౌఖిక పరీక్షను గూర్చి వివరించిరి. శ్రీ మాజేటి గురవయ్య హైస్కూలు ప్రధాన అధ్యాపకులు శ్రీ బి.హెచ్. సత్యనారాయణమూర్తిగారు పరీక్షలలో ఉత్తీర్ణులయిన విద్యార్థులకు తమ ఆశీస్సులు అందజేసిరి. మండలి ఉపాధ్యక్షులు శ్రీ వేము భావనారాయణగారు - "దేశ సమైక్యతకు హిందీ నేర్చుకొనవలసిన అవసరమున్నదని" ఉద్ఘాటించిరి.

సీనియర్ హిందీ ప్రచారకులు మరియు రిటైర్డ్ హిందీ లెక్చరర్ శ్రీ అబ్బరాజు వెంకట రమణారావుగారికి ప్రచారక సన్మానము జరిగినది. మండలి సంయుక్త కార్యదర్శి శ్రీ సి.హెచ్. హనుమంతరావుగారు శ్రీ రమణారావు గారి హిందీ భాషా ప్రచారమును గూర్చి వివరించిరి. ముఖ్య అతిథి శ్రీ సురుళీగారు శ్రీ రమణారావుగారిని శాలువతో సత్కరించిరి. సన్మాన గ్రహీత శ్రీ రమణారావుగారు తనకు జరిగిన సన్మానమునకు కృతజ్ఞతలు తెలియజేస్తూ, మండలి కార్యకలాపములను చూసి ముగ్ధులయి, తమ హర్షమును వెల్లడించిరి. మండలి అధ్యక్షులు శ్రీ సురుళీగారిని నూతన వస్త్రములు మరియు శాలువతో సత్కరించిరి. పట్టణములోని అనేకమంది హిందీ ప్రచారకులు మరియు నార్గాయణ బుక్‌స్టాల్ వారు శ్రీ సురుళీగారిని సత్కరించిరి.

తదనంతరము గుంటూరు పట్టణము నుండి సర్వప్రథములుగా వచ్చిన విద్యార్థులకు హిందీ బోధన చేసిన అధ్యాపకులకు, మండలి అధ్యక్షులు రామకృష్ణారావుగారి దాతృత్వముతో, వారే స్వయముగా హిందీ అధ్యాపకులను సన్మానము చేసిరి. సర్వప్రథములుగా వచ్చిన విద్యార్థులకు శ్రీ వేము భావనారాయణగారి దాతృత్వముతో, వారే స్వయముగా విద్యార్థులకు బహుమతుల నందచేసిరి. అట్లే సర్వ ద్వితీయులుగా, తృతీయులుగా వచ్చిన విద్యార్థులకు కూడా బహుమతులు యివ్వబడినవి.

మండలి సహాయ కార్యదర్శి శ్రీ యస్. గిరిధరరావు గారు తమ తల్లి జ్ఞాపకార్థము, 1998వ సం॥ ము నుండి, హిందీ లైపు పరీక్షలలో, గుంటూరు పట్టణము నుండి సర్వప్రథములుగా వచ్చు విద్యార్థులకు బహుమతులిచ్చుటకు గాను రు. 1116/-లు మండలికి విరాళముగా యిచ్చిరి. ముఖ్య అతిథి శ్రీ సురుళీగారి కరకమలములతో సుమారుగా 500 మంది విద్యార్థులకు ప్రమాణ పత్ర వితరణ జరిగినది. మండలి కార్యవర్గ సభ్యులు శ్రీ యమ్. యల్లారావుగారు వందన సమర్పణ చేసిరి. జాతీయ గీతముతో సభ దిగ్విజయముగా ముగిసినది.

## పరీక్షార్థులకు ప్రచారకులకు గమనిక

పరీక్ష దరఖాస్తులు పంపు ప్రచారకులు మరియు పరీక్షార్థులు దరఖాస్తును సరియగు పరీక్షా శుల్కముతో బాటు పూర్తి వివరములతో పంపవలెను పరీక్షా శుల్కము లేకుండా పంపిన దరఖాస్తులు త్రిప్పి పంపబడును. అందువలన పూర్తి పరీక్షా శుల్కముతో దరఖాస్తులు పంపకోరుచున్నాము.

ప్రచారకులుగాని, పరీక్షార్థులుగాని సభ యొక్క రాష్ట్ర భాష మరియు ప్రవేశిక పరీక్షలు వ్రాయుటకు పంపు దరఖాస్తులతో అంతకు ముందు పరీక్షా ఉత్తీర్ణతా వివరము నకలు (మార్కులు సూచీగాని, ప్రమాణపత్రము యొక్క జిరాక్స్ గాని) జతచేసి తప్పక పంపవలెను పూర్వ పరీక్ష ఉత్తీర్ణతా వివరము లేకుండా పంపిన దరఖాస్తులు పరిశీలించబడవు

పరీక్ష దరఖాస్తులు నియమము ప్రకారము నిర్ణయించిన ఆఖరి తారీఖు వరకు లేటు ఫీజు లేకుండా మరియు లేటు ఫీజుతో సహా) అందునట్లు పంపవలెను. ఆఖరి తారీఖు దాటిన తరువాత చేరిన దరఖాస్తులు పరిశీలించబడవు

ఉచ్ఛ పరీక్షకులకు సంబంధించి, అనగా విశారద మరియు ప్రవీణ పరీక్షార్థులు తమ దరఖాస్తులను పరీక్షా శుల్కముతో సహా హైదరాబాద్ మరియు విజయవాడ సభ కార్యాలయములో ఇచ్చి రసీదు పొందవచ్చును ప్రారంభిక పరీక్షా శుల్కముతో ఉచ్ఛ పరీక్షా శుల్కము కలిపి పంపకూడదు. విడివిడిగా పంపవలెను

## పరీక్షార్థులకు ముఖ్య సూచనలు

పరీక్షార్థి ప్రవేశ పత్రముతో పరీక్షా కేంద్రమునకు వెళ్ళవలెను. ఏ కారణము చేతనైనా ప్రవేశపత్రము లేనిచో ఆ పరీక్షార్థి పేరు హాజరు పట్టికలో ఉన్న ఎడల పరీక్ష వ్రాయుటకు అనుమతించబడును. అంతేకాకుండా తాత్కాలిక నెంబరుతో పరీక్ష వ్రాసినచో ఆ ఉత్తర పుస్తకమును దిద్దించుట జరుగదు పరీక్ష హాలులో తాత్కాలిక నెంబరు ఇచ్చుటకు ముందుగా అన్ని వివరములు చూపి తదుపరి ఆంధ్రసభ కార్యదర్శి అనుమతి లభించిన మీదటనే పరీక్ష వ్రాయవలెను

**కార్యదర్శి**

## శ్రద్ధాంజలి



13-2-'50 – 12-11-'97

దక్షిణ భారత హిందీ ప్రచారసభ - ఆంధ్రకు అధ్యక్షులు అయిన శ్రీ బోయపాటి నాగేశ్వరరావుగారి ప్రథమ పుత్రుడు సభ శాశ్వత సభ్యులు అయిన డా॥ **బోయపాటి విజయమోహన్** గారు **12–11–1997**వ తేదీన ఆకస్మిక మరణమునకు ద.భా.హిందీ ప్రచార సభ కార్యదర్శి, కార్యకర్తలు వారి కుంటుంబ సభ్యులకు తమ ప్రగాఢ సంతాపమును తెలపుచు దివంగత ఆత్మకు శాంతిని కలుగచేయ వలసినదిగా భగవంతుని ప్రార్థించుచున్నాము.

ఇట్లు
కార్యదర్శి

# వెత్యా అభినందన సభ

కాజా వెంకటేశ్వరరావుగారు, ఆం.ప్ర. ప్రచారక మండలి అధ్యక్షులు;
సీతారామదాస్, కృష్ణాజిల్లా; వెంకటాచార్యులు సెక్రటరీ,
పశ్చిమ గోదావరి జిల్లా ప్రచారక మండలి వారు స్మరణికను బహూకరిస్తున్న చిత్రం

---

## విజ్ఞప్తి

హీరక్ జయంతి హిందీ పరిచయ్ మౌఖిక పరీక్ష నిర్వహించు ప్రచారకులు వివరణ సూచీలో పరీక్షార్థి పేరు, తండ్రి పేరు వ్రాయవలయును. మరియు ఆయా సంగరకుల ద్వారా పుస్తకములు పొందిన వివరములు విధిగా తెలియచేయుచు పరీక్ష నిర్వహించిన తరువాతనే పరీక్షార్థుల వివరణ సూచీని ఆయా సంగరకుల ద్వారా పంపగలరు.

కార్యదర్శి

## హీరక జయంతి (వజ్రోత్సవ) హిందీ పరిచయ మౌఖిక పరీక్షలు

హిందీ పరిచయ పరీక్ష పుస్తకములు ఆయా జిల్లాల సంగఠకుల నుండి పొందగలరు.

పరీక్ష తేది : 25 జనవరి 1998
పరీక్ష తేది : 29 మార్చి 1998
పరీక్ష తేది : 31 మే 1998

పరీక్షా రుసుము : రు. 15-00 పుస్తకము : ఉచితము

**కార్యదర్శి**

1997 నవంబర్ 30న నిర్వహించిన హీరక్ జయంతి (వజ్రోత్సవ) హిందీ పరిచయ్ మౌఖిక పరీక్షకు నాలుగు వందల మంది విద్యార్థులను పరీక్షకు పంపిన హిందీ ప్రచారకుల వివరణ :

| | | | | |
|---|---|---|---|---|
| 1. | శ్రీ బి.పి. మిశ్రా | - | విజయనగరం | |
| 2. | శ్రీ ఎమ్. హబీబ్‌పాషా | - | కర్నూలు | |
| 3. | శ్రీ ఎన్. లింగేశ్వర్ | - | నిర్మల్ - | ఆదిలాబాద్ |
| 3. | శ్రీ కె.జె. అంబాజీరావ్ | - | వనపర్తి - | మహబూబ్‌న |

BOOK-POST

To — 29/804.
Dr. B.RaMARAJU,
— 1-8-117/2, Chikkadapally,
HYDERABAD-500 020.

Edited, Printed and Published by O. Suruli on behalf of the D.B. Hindi Prachar Sabha - Andhra, Khairatabad, Hyderabad - 500 004.
and Printed at V.S.S. Laser Graphics, Hyderabad. Ph. : 3325979